# భువన విజయము



పోలూరి హనుమజ్జానకీరామశర్మ

బి. ఏ. (ఆనర్సు)

ప్రాచ్య భాషా విభాగాధ్యక్షుఁడు

శ్రీ వేంకటగిరి రాజా కళాశాల

నెల్లూరు



క్వాలిటీ పబ్లిషర్సు

విజయవాడ-2

క్వాలిటీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
డిశెంబరు 1975



వెల రూ. **5-00**



Paper used for Publication of this text book was made available at concessional rate by Government of India through Government of Andhra Pradesh and Publishers & Book Sellers Association of Andhra Pradesh.

ముద్రణ : గ్రామస్వరాజ్య ప్రెస్
విజయవాడ-2

# సమర్పణము

కం॥ శ్రీ పోలూరి కులాభ్యుద
యాపాదక సుగుణ ఖనికి నాత్త శ్రీగీ
తా పారాయణ సంహృత
తాపునకుఁ బరోపకారతత్పరకృతికిన్ ॥

కం॥ వేంకట నరసాంబాయుత
వేంకట నారాయణాఖ్య పితృదేవునకున్
సంకట సంహార హనుమత్
పంకజ నిభ పాదయుగ్మ బంభరమతికిన్॥॥

కం॥ కవితాగోష్ఠి విలసిత
నవరూపక నిర్మితి యిది నవరసరుచియై
స్తవనీయున కంకితమై
దివిషద్వరణీయ సుకృతి దీప్తి నొసంగున్॥



# తొలిపలుకులు

ఈ రూపక రచనా ప్రదర్శనములు శ్రీ మదనమోహన మాళవీయ సాహిత్యమండలి చరిత్రయందు ఉజ్జ్వల ఘట్టములు. 1965 అక్టోబరులో మా మిత్రులు శ్రీ చల్లగుండ రామచంద్రయ్య శ్రేష్ఠిగారు సాహిత్య మండలికి అధ్యక్షులుగనున్న శ్రీమాన్ కిళాంబి శ్రీనివాస రామానుజాచార్యుల వారితో, "పెక్కు నగరములలో "భువన విజయ" ప్రదర్శనములు జరుపు చున్నారుగదా, మననగరమునందును అట్టిది జరుపవలయునను కుతూహలము నాకుకలదు. సాహిత్యమండలి యాజమాన్యమున మీరు దానిని నిర్వహింపఁబూనినచో దానికగు వ్యయమున నూఱు రూప్యములనే నొసంగఁగల" నని పల్కిరి. ఆచార్యులవారును అందులకు సంతోషముగా పూనుకొని రానున్న శ్రీ మదనమోహన మాళవీయ జయంతిలో ఆ ప్రదర్శనమును జరుపవలయునని నిశ్చయించి దానికి కావలసిన సాహిత్యమును సాధ్యమైనంత త్వరలో సమకూర్చవలసినదని నన్ను కోరిరి. నేనును సుమారు పదునైదు దినములలో ఇందు చతుర్థపంచమాంకములుగా నున్నవానిని రచించి ఆచార్యుల వారికి, కార్యనిర్వాహక వర్గసభ్యులైన చి॥ పిసుపాటి వెంకటవాసుదేవ శర్మ, చి॥ ఎస్ సుబ్రహ్మణ్యము, చి॥ మేడవరపు మల్లిఖార్జునశర్మ మొదలగువారికి వినిపించితిని. వారును దాని నభినందించి, రూపక ప్రయోగమునకు వలసిన కవులను పండితులను అభ్యర్థించి పాత్రధారి వర్గమును ఏర్పఱచి యొద్దికలను ( Rehearsals ) ప్రారంభించిరి. అచిరకాలముననే శ్రీ రామచంద్రయ్య శ్రేష్ఠిగారొసంగిన నూఱు రూప్యములు ఖర్చయ్యెను. అంతట అధ్యక్షులవారు కార్యనిర్వాహకవర్గ సభ్యులును మరికొన్ని విరాళములు సంపాదించి, అనుకొన్న ప్రకారముగా 1-1-1966 తేది శనివారం సాయంకాలము మా కళాశాల ప్రధానాధ్యాపకులు శ్రీ రేమాల సుబ్బారెడ్డి M A., B, Ed., గారి యధ్యక్షత

యందు నెల్లూరు పురమందిరమునజరిగిన శ్రీ మదనమోహన మాళవీయ జయంతిమహోత్సవ సభయందు భువనవిజయ ప్రదర్శనమును నిర్వహించిరి.

డాక్టర్ చింతామణి దేశ్‌ముఖ్‌గారు ప్రారంభకులుగా శ్రీమాన్ మాడభూషి అనంతశయనంఅయ్యంగారి యధ్యక్షతయందు 24-12-1967 తేదీ ఆదివారము సాయంకాలమున నెల్లూరు పురమందిరమున జరిగిన వర్ధమాన సమాజ వజ్రోత్సవమునందు ( షష్ట్యబ్దిపూర్తి, **Diamond Jubilee of the Progressive Union, Nellore** ) చి॥నాగిరెడ్డి హరిశ్చంద్రారెడ్డి ప్రోత్సాహమున మరల పై రెండంకములు సాహిత్యమండలి యాజమాన్యమున ప్రదర్శింపఁబడెను.

తిరుపతియందు శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాల వార్షికోత్సవములలో 31-3-1968 తేది ఆదివారము సాయంకాలమున శ్రీమాన్ మాడభూషి అనంతశయనం అయ్యంగారి యధ్యక్షతయందు జరిగిన మహాసభలో, ఆ కళాశాల ప్రధానాధ్యాపకులు శ్రీమాన్ T. K V. N. సుదర్శనాచార్యులవారి కోరికపై ఆ కళాశాలలోనే అధ్యాపకుడుగా నున్నవాఁడును, నెల్లూరులో కొంతకాలము సాహిత్యమండలికి ఉపాధ్యక్షుడుగా, అధ్యక్షుఁడుగా నున్నవాఁడును అగు చి॥ ఆకెళ్ళ అచ్చన్నశాస్త్రి సహకారమున పైరెండు అంకములు మరల సాహిత్యమండలి యాజమాన్యమున ప్రదర్శింపబడినవి.

ఆ సంవత్సరము మాళవీయ జయంతిలో మరల భువనవిజయమును ప్రదర్శింపవలయునని సాహిత్యమండలి కార్యనిర్వాహక వర్గము వారు తీర్మానించిరి. మరల వెనుకటియంకములనే ప్రదర్శించుటకన్న క్రొత్తవాటిని ప్రదర్శించుట మేలనిపూర్వాంకములను మూడింటిని రచించి రూపకమును అయిదంకముల నాటకముగా రూపొందించితిని. పిదప 25-12-1968 తేది సాయంకాలము మా కళాశాల ప్రధానాధ్యాపకులు

శ్రీ రేమాల సుబ్బారెడ్డి M. A., B. Ed., గారి యధ్యక్షతయందు జరిగిన శ్రీ మదనమోహన మాళవీయ జయంతి మహోత్సవ సభయందు నెల్లూరు పురమందిరమున ఇందలి ద్వితీయ తృతీయాంకములను ప్రదర్శించితిమి.

ఈ నాలుగు ప్రదర్శనములకు నేనే ప్రయోక్తనుగా (Director) నుంటిని. ఈ ప్రదర్శనములలో పాత్రధారులుగా (Actors), వాచిక సహాయకులుగా (Prompters), నేపథ్య గాయకులుగా, రంగాలంకరణ సహాయకులుగా, పెక్కురు పండితులు, కవులు, గాయకులు కళాకారులును ఎన్నోవిధములుగా తోడ్పడిరి. వారి కందఱకును మిక్కిలి కృతజ్ఞుఁడను.

15-2-1969 తేది శనివారము సాయంకాలమున వర్ధమాన సమాజ యాజమాన్యమున నెల్లూరు పురమందిరమున జరిగిన నన్నయ్య జయంతి మహోత్సవమునందు వదాన్యశేఖరులు శ్రీతిక్కవరపు రామిరెడ్డిగారు నన్ను సన్మానించిరి. ఆ సందర్భమున మా యున్నత పాఠశాలలో ఆంధ్రభాషా పండితుఁడుగానున్న చి॥ పి. ఎం. గోపాలాచారి దర్శకత్వమున విజ్ఞానతరంగిణీ సమాజమువారు ఇందలి పంచమాంకమును ప్రదర్శించిరి.

విద్యావిధాన పరిశోధన శిక్షణ జాతీయసంఘమువారు (National Council of Educational Research and Training, New Delhi) "ఉపాధ్యాయుల బోధన నైపుణ్యమునకు, విద్యార్థుల గ్రహణ సౌలభ్యమునకు సామాజిక విధానముల నుపయోగించుకొనుట" (Utilising Community resources for better teaching and learning process) అను ప్రణాళికను ప్రయోగాత్మకముగా

(Experimental Project) ఉన్నత పాఠశాలలో ప్రవేశపెట్టిరి. ఆ ప్రణాళికక్రింద నెల్లూరు వేద సంస్కృతోన్నతపాఠశాలా ప్రధానోపాధ్యాయులు శ్రీ కె, వి. రమణయ్య M. A. B. Ed., గారి ప్రోత్సాహమున, శ్రీ మాచవోలు రాజశేఖరం B. A. B. Ed, గారి దర్శకత్వమున తొమ్మిదవతరగతిలోని విద్యార్థినీ, విద్యార్థులు సాంఘికశాస్త్రము (Social Studies) లోని, 'శ్రీకృష్ణదేవరాయలు' అను పాఠ్యభాగము నుద్దేశించి యిందలి పంచమాంకమును అభ్యసించి, 26-3-1972 తేది ఆదివారము సాయంకాలమున, శ్రీ U. భానుమూర్తి M. A. B. Ed., (Co-ordinator, Extension Service, Government College of Education, Nellore) గారి యధ్యక్షతయందు జరిగిన వార్షికోత్సవ సందర్భమున ప్రదర్శించిరి.

ఇంకను పలువురు మిత్రులు దీనిని ప్రదర్శింపఁగోరిరి. కాని తగిన వ్రాఁతప్రతులను వారికి అందించజాలకపోయితిని. ఇప్పుడిది ముద్రితమైనది. కావున దీనిని సహృదయులు ఆదరించి పెక్కు పర్యాయములు ప్రదర్శింపఁగలరని ఆశించుచున్నాను.

శ్రీ 'విమలానందభారతి' పత్రికయందు దీనిని ప్రకటించుచు మిక్కిలి శ్రద్ధతో పునర్ముద్రణ ప్రతులను సమకూర్చి ఈ తొలిప్రకాశమునకు కారకులైన తత్పత్రికా స్థాపకులు సంపాదకులునైన మా బావగారు శ్రీ కారుమంచి కొండలరావు B. A. B. Ed., గారికి మరల నిప్పుడు మలిముద్రణకు కారకులైన శ్రీ కప్పగంతుల మురళీకృష్ణగారికి ఎంతయు కృతజ్ఞుఁడను.

నెల్లూరు　　　　　విద్వజ్జనవిధేయుఁడు

21-11-75　　　　　పోలూరి హనుమజ్జానకీరామశర్మ.

# పాత్రలు

శ్రీకృష్ణదేవరాయలు : విజయనగర సామ్రాజ్య చక్రవర్తి

తిమ్మరుసు : మహామంత్రి

పెద్దన : ఆస్థాన కవి

తిమ్మన : ,,

ధూర్జటి : ,,

రామ భద్రుడు : ,,

మల్లన : ,,

రామకృష్ణుఁడు: ,,

సూరన : ,,

భట్టుమూర్తి : ,,

ఎల్లన : ఆగంతకుడైన కవి

నృశింహ కవి :

వరసరాజు :

చిన తిమ్మన్న : కొప్పోలు కరణము

తిమ్మప్ప : దౌవారికుఁడు

దౌవారికుఁడు,

వందిమాగధులు.

శ్రీ ర స్తు

# భువన విజయము

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

సూత్ర: కం॥ శ్రీ నిత్యులైన మూల
స్థానేశ్వర రంగనాథ దైవతవర్యుల్
మానితముగ మీ కిత్తురు
నానా రసపూర్ణతాభినంద్య శుభంబుల్ ॥

శ్రీ మదనమోహన మాళవీయ పండిత జయంత్యు త్సవ సమాగతులైన యార్యమహాశయుల కిదే ప్రణమిల్లు చున్నాను. (నమస్కరించి) ఈ సందర్భమున

తే॥ గీ॥ అష్టదిగ్గజ ప్రఖ్యాతి నలరు కవుల
గాథ లాధారముగ రూపకమ్ముఁ గూర్చె
ప్రథితుఁడు హనుమజ్జానకీ రామశర్మ
యరసి యాబాలగోపాల మభినుతింప ॥

తే॥ మాళవీయాంక సాహిత్య మాండలికులు
నిపుణ విబుధార్చనమ్ముగా నిర్వహించు
చాక్షుషంబైన కృతువిద్ది సరసులార !
భవ్య రస సుధా స్వాదనపరతఁ గనుఁడు

(తెరలో శబ్దము)

ఏమో సంరంభముగా నున్నది. (ప్రక్కకుఁ జూచి) ఔనౌను. ఇప్పుడు శరన్నవరాత్రములలో రాయలవారు సాహిత్యోత్సవములను జరుపుచున్నారుగదా! అందులకే జనులందఱు కవులను గూర్చి కావ్యములను గూర్చియే కోలాహలముగఁ జెప్పుకొనుచున్నారు. (దూరమునకుఁ జూచి) ఎవరతఁడు? తిమ్మప్పయేనా? పెద్దన్నగారి యింటి వైపు వడిగాఁ బోవుచున్నాఁడు. నేనును వానిని కలిసికొని విశేషములేమో తెలిసికొందును. (నిష్క్రమించును.)

ఇది ప్రస్తావన

---

శ్రీ ర స్తు

# భువనవిజయము

## ప్రథమాంకము

పెద్దనామాత్యుని ఇల్లు. ఒక ప్రక్కగా నొక బల్ల. దానిపై కొన్ని తాళపత్ర గ్రంథములు. మఱియొక ప్రక్క మూఁడు కుర్చీలు. బల్లకు ప్రక్కన చాపపై సూరన్న ఒక చిన్న వ్రాత బల్లముందు కూర్చుండి తాళపత్రములపై గంటముతో వ్రాయుచుండును. పెద్దన బల్లపై నున్న సింహ తలాటములను చేతులకు వేసికొనుచుండును.)

పెద్దన : ఏదీ నా శాలువా ?

సూరన : (లోపలికి పోయి తెచ్చి) ఇదిగో !

తిమ్మప్ప: (ప్రవేశించి) దండాలండీ బాబయ్యా ! దండాలండి ! (నమస్కరించును.)

పెద్దన : శుభం భూయాత్. ఏమి విశేషములు ?

తిమ్మప్ప : ఎల్లన్నగారి దగ్గఱనుండి ఏమైన వర్తమానము వచ్చినదేమో కనుఁగొని రమ్మని ప్రభువులు పంపించినారు.

పెద్దన: నిన్నరాత్రియే వారిదగ్గఱనుండి వార్తవచ్చినది వారీ శరన్నవరాత్రి సాహిత్యోత్సవములకు ముందే ఇక్కడికి రావలయునని బయలుదేరినారఁట. కాని వర్ష ప్రతిబంధము వలన ప్రయాణము సాగలేదఁట. ఎట్లయినను నేఁటి సాయంకాల గోష్ఠికైనను తప్పక రాఁగలమని కబురు చేసినారని చెప్పుము.

తిమ్మప్ప: చిత్తము.

పెద్దన : రాయలవారు రాధామాధవ కావ్యమును జూచుచున్నారా?

తిమ్మప్ప: తమరు ఏ ముహూర్తములో దానిని వారి కిచ్చితిరో కాని వారు దానిని విడువకుండ చూచుచునే యున్నారు. అప్పుడప్పుడు తాము చదివి వినిపించుచు ఒక్కొక్కప్పుడు తిరుమలదేవిగారిని చదువుమని విని ఆనందించుచున్నారు.

పెద్దన : (సంతోషముతో) అట్లయినచో ఎల్లన్నగారి రొట్టె విఱిగి నేతిలో పడినట్లే.

తిమ్మప్ప: (ఉత్సాహముతో) సందేహ మేమున్నది బాబయ్యా! ఎల్లన్నగారు వచ్చినచో గొప్పగా సత్కరింతు ననుకొందును. తమరింతసేపు నిల్చుండియే మాటాడుచున్నారు. కూర్చుండుడు.

పెద్దన : (కుతూహలముతో) ఇంకేమన్న విశేషమున్నదా?

తిమ్మప్ప: మఱేమియు లేదు. మీరేదో పనిమీఁద బయలుదేరుచున్నట్లున్నారు. తమరు విశ్రాంతిగా ఉన్నప్పుడే వచ్చెదను.

పెద్దన : (కూర్చుండి) ఊఁ ఇప్పుడు తొందర పని ఏమున్నది?

తిమ్మప్ప: ఒక పద్యానికి తమ దగ్గఱ అర్థము తెలిసికోవలెనని.

పెద్దన : (నవ్వుచు) పద్యమున కర్థమా ? నీకు కూడ సాహిత్య గంధ మబ్బినట్లున్న దే !

తిమ్మప్ప: (వినయముతో) అంతా తమ దయ.

సూరన : వానికేమి ? సాహిత్య గోష్ఠి జరుగునపుడు వాని దృష్టి యంతయు మన మీఁదనే యుండును.

పెద్దన : మంచిదే ! ఏమా పద్యము చదువుము.

తిమ్మప్ప: (ఆకును తీసి చూచుచు చదువుటకు సందేహించుచు సూరన్న వైపు చూచును.)

పెద్దన : సూరన్నా ! నీవు చదువుము.

సూరన : (ఆకును తీసికొని తలయూఁచుచు నొకసారి చదువుకొని గొంతు సవరించుకొని)

శా॥ ఆ నిష్ఠానిధి గేహసీమ నడురే యాలించినన్ మ్రోయు నెం
తే నాగేంద్రశయాను పుణ్యకథలున్ దివ్య ప్రబంధాను సం
ధాన ధ్వానము 'నాస్తి శాక బహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ
పో నాస్త్యోదన సౌష్ఠవంచ కృపయా భోక్తవ్యమన్ మాటలున్.

(పెద్దన ఆలోచించుచుండును.)

తిమ్మప్ప: ఆ సంస్కృతపు ముక్కలు ఏమీ తెలియ లేదు బాబయ్యా !

సూర : తెలుఁగున పద్యమునుగూడ అన్వయించుకోఁగల వన్నమాట. అయినచో కొంచెము సంస్కృతమును కూడ నేర్చుకొనకపోయినావా ?

తిమ్మ : ఈ బుద్ధి చిన్నప్పుడే ఉండినచో బాగుపడక యుందునా బాబయ్యా ! 'బుద్ధిగా చదువుకోరా' అని మా నాయన నన్ను తీసికొనిపోయి రామానుజయ్యగారి దగ్గఱ అప్పగించినాఁడు. చల్లనితల్లి మంచి వేళ జ్ఞప్తికి వచ్చినది. ఆండాళమ్మగారి చేతి దధ్యోదనము, చక్కెరపొంగలి, పులిహోర ఒడలికి పట్టినట్లుగా అయ్యగారు చెప్పిన పద్యాలు, శ్లోకాలు తలకు పట్టకపోయె. వారెట్లో తంటాలుపడి తెలుగులో నాలుగు ముక్కలు చెప్పి తక్కినవారికి సంస్కృత మారంభము చేయుచు 'తిమ్మప్పా ! నీవు తిండికి తిమ్మరాజువు. పనికి పోతరాజువు' అని...

పెద్దన : (శితముగా చూచుచు) అది సరే ! నీ పీ పద్యము తీసికొని వచ్చుట రాయలవారికి తెలియునా ?

తిమ్మ : (నివ్వెఱపడి, తెల్లపోయి) తెలియదు.

పెద్దన : వ్రాయసకాఁడు నరసప్పకదా! నీ కిది వాఁడిచ్చినాఁడా?

తిమ్మ : (చేతులు నలుపుకొనుచు) లేదు. రాయలవారు విశ్రమించుటకై లోనికి వెళ్ళఁగా వాఁడుకూడ వేఱొక పనిమీఁదపోవుచు ఆ గ్రంథమునుకట్టి అక్కడనే పెట్టెమీఁద పెట్టఁగా...

పెద్దన : నీవే దీనిని సంగ్రహించినా వన్నమాట.

తిమ్మ : (దైన్యముతో) ఏలినవారు కటాక్షించవలెఁ. ద్వారముదగ్గఱ పడియుండువాఁడను. ఇది ఇంత తప్పని తెలియదు బాబయ్యా! ఏదోపద్యముగదా అర్థము తెలిసికోవలెనను తాపత్రయముతో గబగబ ఆకుమీఁద వ్రాసికొని తీసికొని వచ్చితిని అంతే బాబయ్యా! మీ పాదాలకు మ్రొక్కుదును. మన్నింపుము బాబయ్యా!

సూర ఇదేమంత పెద్ద విషయమా ?

పెద్దన : ఇప్పుడిది పెద్ద విషయము కాకపోవచ్చు. కాని యజమానికి తెలియకుండ ఏ వస్తువైన వెలికి తీసికొని వచ్చుట క్షంతవ్యముకాదు కదా!

సూర : పద్యముకూడ వస్తువేనా? ఈనాఁడు కాకున్న రేపైనను పదిమందినోళ్ళ కెక్కవలసినదే కదా!

పెద్దన : సూరన్నా ! నీ కర్థము కావలసిన విషయము లనేకములు కలవు. ఈ పద్యము నిప్పుడు నీవు చూచితివి. నేనును చూచితిని. రేపటికి మఱికొందఱు చూడఁ గలరు. ఎవఁడైన నొకఁడు ఈ పద్యము బాగున్న

దనుకొని, ఇందలి భావమునో, పద్యముల కూర్పునో, కైకొని తాను పద్యములు వ్రాసినచో అప్పుడుగదా చిక్కువచ్చునది? 'రాయలవారు సొంతముగా వ్రాసినదేమున్నది? అంతయు నితరకవుల పద్యముల నుండి సంగ్రహించినదే కదా!' యని ఆక్షేపింతురు.

సూర : అట్లని యెవరందురు? అన్నచో ఎవరొప్పుకొందురు?

పెద్దన : మత్సరగ్రస్తులందురు. శత్రువు లంగీకరింతురు. రాయలవారి పూర్వులు సమరాంగణ దిగ్విజయము లను మాత్రమే సాధించియుండుటచే శత్రురాజులు సాహిత్యములోనైన తమ కాధిక్యము కలదుగదా యని సంతోషించుచుండిరి. ఇప్పుడు రాయలవారు సాహిత్యమునందును చక్రవర్తిత్వము నెఱపుచుండుట శత్రువులకేమి, సామంతులకేమి కుత్తుకబంటిగా నున్నది ఏ చిన్న యవకాశము లభించినను వారు రాయలవారి కీర్తి సౌధమును కూలఁద్రోయుటకు వెనుదీయరు.

తిమ్మ : అమ్మ! బాబోయ్! ఇందులో ఇంత చిక్కున్నదని నాకు తెలియదు. ఏదో బుద్ధిగడ్డితిని ఇట్లు చేసి తిని. ఈ సారికి క్షమింపుడు బాబయ్యా! పిల్లలు గల వాఁడను. మీ పాదాలు పట్టుకొందును. (అని పాద ములపై పడుటకు ముందుకు వచ్చును.)

పెద్దన : సరే! మరల ఇటువంటిపని చేయకుము. తెలిసినదా?

తిమ్మ : (వంగి నమస్కరించును) చిత్తము బాబయ్యా! చిత్తము. మఱి నాకు సెలవిప్పింపుఁడు.

సూర : ఇంతకు పద్యమున కర్థము తెలిసికొనలేదే?

తిమ్మ : ఈ పద్యాలు గిద్యాలు నా కెందుకు బాబయ్యా! ఏదో బుద్ధి గడ్డితిని......

పెద్దన : దాని కేమిలే! చాల ఆశపడి వచ్చితివి. పద్యమున కర్థము చక్కఁగా తెలిసికోవలెనని తాపత్రయపడు వా రెందఱుందురు? సూరన్నా! పద్యమున కర్థము కుదిరినదా?

సూర : సంస్కృతమున కేమిగాని, తెలుఁగు పదముల కర్థము కుదురుటలేదు. (తిమ్మప్పను చూచి) మఱి వానికెట్లు తెలిసిననో?

తిమ్మ : నా మొగము. నాకు మాత్రము తెలిసినదా? దేవి గారును ఇట్లే అనుగగా రాయలవారు చెప్పఁగా వింటిని. ఆమె సంస్కృతి ముసుగ లేదు వారు చెప్ప లేదు.

సూర : అదియా సంగతి! (పెద్దనను చూచి) 'నసురే యాలించినన్ మోఁ్రయు' ననఁగానేమి? నసురేయి వినుటయేమి? అర్థరాత్రి అనునది కూడ నొక వ్యక్తి యేనా?'

పెద్దన : (విసుగుతో) అట్లు కాదోయీ! 'నడురేయి' అనగా 'నడురేయిన్' అనగా 'నడురేయి యందు' అని అర్థము. 'అర్థరాత్రియు నందైనను ఆ విష్ణుభక్తుని ఇంటి యొద్దకుఁబోయి వినినచో' అని భావము.

సూర : నడురేయిన్ అను సప్తమికి ప్రథమ చేసికొని దాని మీఁద ఇత్వసంధియా! బాగున్నది మఱి 'మ్రోయుట' యేమి? తుమ్మెదలు మ్రోయును. లేదా వాద్యములు మ్రోయును. ఇక్కడ మ్రోయున వేవి?

పెద్దన : నాగేంద్రశయాను పుణ్యకథలు. అనగా హరి కథలు, దివ్య ప్రబంధములు చదువునప్పటి ధ్వని, లోపల భోజనములు చేయుచున్న యతిథులకు చెప్పఁ బడుచున్న యుపచార వాక్యములు — ఈ మూఁడును మ్రోయుచున్నవి. అనగా మాఱుమ్రోగుచున్నవని యర్థము.

సూర : అబ్బా! ఇదియేమి రచన? ఇదేదో అరవ తెలుఁ గుగా నున్నది కాని సామాన్యముగ లేదే!

పెద్దన : (కోపముతో) తెలియనివాఁడవు తెలియనట్లుం డుము. పెద్దలపై నీ విమర్శ యేమి! (తిమ్మప్పవైపు చూచి) ఇఁక వినుము ఆ సంస్కృతములో నున్నవి అతిథులకుఁ జెప్పబడుచున్న యుపచార వాక్యములు.

తిమ్మప్ప: చిత్తము! చిత్తము!

పెద్దన : 'నా స్త్రీశాక బహులతా' అనఁగా కూర ఎక్కువగాఁ లేవు. 'నా స్త్యపూపః' అనఁగా అప్పము లేదు. 'నా స్త్యోదన సౌష్ఠవం చ' అనగా అన్నము కూడ సరిగా లేదు అని యర్థము.

తిమ్మన్న : చిత్రము ! చిత్రము! ఇప్పుడు చక్కఁగా తెలిసినది. మఱి నాకు సెలవిప్పింపుఁడు.

పెద్దన : ఇప్పుడు మనలో జరిగిన ప్రసంగమును ఎవరితోను చెప్పకుము. తెలిసినదా? వెళ్ళిరా! (తిమ్మప్ప కుడి వైపు వెళ్ళును) సూరన్నా! వానియెదుట అట్లు ప్రసంగింతు వేమి?

సూరన్న : ఇందు తప్పేమున్నది? ఉన్నమాట యంటిని.

పెద్దన : పిచ్చివాఁడా! ఉన్నమాటే యైనను అనుట తగునా?

సూరన్న : వీఁడుపోయి రాయలవారికి చెప్పునని యా మీ యభిప్రాయము ?

పెద్దన: వీఁడు వెంటనేపోయి రాయలవారికి చెప్పునని కాదు నా యభిప్రాయము! ఎప్పుడైనను ప్రసంగము వచ్చి నప్పుడు వారితో ననవచ్చును. అట్లైన నొంత వఱకు మేలే. కాని వీఁడితరులతో రాయలవారి కవిత్వమును గూర్చి సూరన్నగా రిట్లన్నారని యనుటయే సహజము- అది యా నోట నా నోట చిలువలు పలువలుగా రాయలవారి చెవికి చేరుట సులభము.

సూరన : అట్లయినను ఇంత సులభముగా నపార్థము చేసి కొనునా ? ఆయన ఉదారుఁడు కదా !

పెద్దన : ఆయన ఉదారుండేమి మహోదారుఁడే యగును. కాని యాదార్యమునకును కొన్ని యవధులు కలవు. ఆయన యెదుటనే నీ విట్లు మాటాడినచో ఇది పిల్ల తనముగా భావించి నవ్వి యూరకుండును. రామ కృష్ణుఁ డింతకన్నను తీవ్రముగా ఎన్ని పర్యాయము లాయన యెదుటనే మాటాడి యుండలేదు? దాని కేమి? మఱి పరోక్షముగా విమర్శించుట ఎవరికైనను కోపకారణమే. అదికాక నీవన్నమాట అట్లే వారి చెవికి చేరునా? సరే! నే నాచార్యులవారి యింటి దాఁక పోయివత్తును. పరదేశి విద్వాంసు లెవరైన వచ్చినచో వారి నాదరించి విశ్రమింపఁజేయుము. (ఎడమవైపు నిష్క్రమించును.)
సూరన అన్యమనస్కుఁడై చేతిలోని యాకును ఇటు నటు త్రిప్పుచు ఆలోచించుచుండును. రామకృష్ణుఁడు కుడివైపునుండి ప్రవేశించును)

రామ : ఏమోయీ! దీర్ఘాలోచనలో నున్నట్లున్నావు? తాత గారు లోపలనున్నారా ?

సూర : (అదిరిపడి తాళపత్రమును దాఁచుటకు ప్రయ త్నించుచు) మీరా? రండు కూర్చుండుఁడు. తాతగా రాచార్యులవారి యొద్దకు వెళ్ళినారు. ఇప్పుడే వచ్చె దరు.

రామ : (నవ్వుచు ఆకువంకనే చూచుచు) ఏమది? పద్యమా! దానిని దాచు టెందులకు? నేను చూడరాదా? (చేయి చాపును)

సూర : (ఇచ్చుచు) చూడకూడదని కాదు. తాతగారు దీనిని బహిరంగపఱుపవద్దన్నారు.

రామ : (నవ్వుచు) అలాగా! నేనును ఎవ్వరికిని చెప్పనులే. (చదువుకొని) ఇది మా యన్నగారి కవిత్వమువలె నున్నదే!

సూర : (నివ్వెఱపడి) మీ యన్నగారా? ఆయన ఎవరు?

రామ : రాయలవారయ్యా!

సూర : రాయలవారా! వారు మీ కన్నగారా?

రామ : (నవ్వుచు) అదేనోయీ! రచనలో నా కాయన అన్నగారు. 'నడురేయాలించినన్ మ్రోయు' అనగా అర్ధరాత్రి యందు ఆలకించినను విన్పించునని కదా యర్థము? ఇట్టి రచనము చేసినచో నేను చేయవలె, లేకున్న మా అన్నగారు చేయవలె! మఱి ఎవరు చేయగలరు?

సూర : (నవ్వుచు) ఔను! మీదిఁకూడ కొంత అరవ తెలుఁగనియే అనిపించును.

రామ : ఓహో! నీ వప్పుడే దీనికి పేరుకూడ పెట్టినావా?

సూర : పేరు పెట్టుటే కాదు. తాతగారిచే చీవాట్లుకూడ తింటిని.

రామ : ఓహో! ఈ పద్యమిక్కడి కెట్లు వచ్చినది?

సూర : తిమ్మప్ప తెచ్చినాఁడు.

రామ : వాఁడు రాయల కాంతరంగిక భృత్యుఁడు కదా! సమక్షమున నీవిట్లు తేలికగా మాటాడితివని వారు కష్టపడి యుందురు. మఱి నీ కింకను పసితనము పోలేదోయీ!

సూర : సరే! నాది పసితనమే యనుకొనుఁడు. ఇట్టి రచనము మాత్రము మహనీయమా?

రామ : అల్పమైనదని నీవు మాత్రము మనఁగలవా? ఇందు కొంత అన్వయక్లేశ మున్నమాట నిజమే. అంత మాత్రమున 'అరవ తెలుఁగని' ఈసడించుకొనతగునా? తిక్కనగారి తెనుఁగు రచనమంతయు నీకు తేనెవలెనే యున్నదా? కవి ఎంత విశిష్టమగు భావనను పెంపొందించుకొనునో వాని రచనయు లోక వ్యవహారమున కంత దూరమగును. ప్రౌఢిమ స్వరూపమే యట్టిది.

సూర : రచనలో ప్రసన్నత లేకున్న మానె, మాధుర్యమైన నుండవలదా?

రామ : అందఱును నన్నయ భట్టారకునివలె, మీ తాతగారి వలె రచింపవలయునన్న నెట్లు సాధ్యమయ్యా? కవిత్వము పుట్టుకతో వచ్చునదే కదా! దాని రీతియు నందే ఇమిడి యుండును. మధ్యలో నెంత ప్రయత్నించి

నను ఒకనివలె నింకొకఁడు వ్రాయఁగల్గుట అసంభవమే !

సూర : అందఱి రచనములు ఒకరీతిలోనే కేవలము మృదుమధురముగా నుండవలయుననికాదు నా అభిప్రాయము. అక్షర రమ్యతలేకున్ననేమి తిక్కన్నగారి రచనమునందువలె నర్థసుభగత్వమైన నుండవలెఁగదా !

రామ : దానికిందు లోపమేమున్నదోయీ ! అసలీపద్యము మీ తాతగారి పద్యమునకు పై రచనము కదా !

సూర : (నివ్వెరఁబడి) మా తాతగారి పద్యమున కిందేమి సంబంధము ?

రామ : (నవ్వుచు) ప్రవరుని యాతిథ్యము నాయన చెప్పెను గదా !

తే॥ గీ॥ వండ నలయదు వేవురు వచ్చిరేని
నన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి
యతిథు లేతేర నడికిరేయైన బెట్టు
వలయు భోజ్యంబు లింట నవ్వారిగాఁగ
(మనుచ 1-56)

సూర : ఔనౌను. దీనిని జూచియే రాయలవారు దానిని వ్రాసినట్లున్నదే ?

రామ : అని చెప్పనక్కఱలేదు. కాని సామ్యము లేకపోలేదు. రెండింటిలో ఏది మేలందువు ?

సూర : ఇందు సందేహ మేమున్నది? తాతగారి పద్యము కడుమనోజ్ఞముకదా !

రామ : (నవ్వుచు) ఔను. ఆయన రేయికి నడుము విఱుగఁ గొట్టి 'నడికి' చేసినను నీకు బాగుగనే యున్నది. దానిని పోనిమ్ము. తాతగారి పద్యములోని సారస్య మంతయు చక్కఁగాఁ నాలోచించి గ్రహించితివా ?

సూర : (ఆలోచించుచు) అర్థము స్పష్టముగనే యున్నది గదా ! ఆలోచింపవలసిన దేమున్నది ?

రామ : అది సరేకాని, తాతగా రెప్పుడైన కాశికి వెళ్ళినారా?

సూర : లేదే ! ఏ మట్లడిగితిరి ?

రామ : ఏమియులేదు. అన్నపూర్ణాదేవి వంటఁజేయుచుఁ జేయి కాల్చుకొనుచుండఁగా చూచి వచ్చినట్లుగదా వారు పద్యము చెప్పినారు. అందువలన-

సూర : అన్నపూర్ణాదేవి వంకుట యేమి?

రామ : ఔనయ్యా! పరమేశ్వరుని గృహిణి అన్నపూర్ణకు ఉద్ది. ఎందులో ? వేవురు వచ్చినను అలుపులేకుండ వండు టలోఁ గదా ?

సూర : ఔను. ఆ స్ఫురణ లేకపోలేదు.

రామ : శ్రీనాథ మహాకవి కాశీఖండమున వ్యాసునకు, శిష్యులకు అన్నపూర్ణాదేవి యొసఁగిన యాతిథ్య మును వర్ణించెనుగదా ! జ్ఞప్తియుం దున్నదా?

సూర : లేకేమి ? అచ్చట వంట ప్రయత్న మెక్కడిది ? విస్తళులయందే పదార్థములన్నియు నావిర్భవించి నట్లే ఆయన వర్ణించినాఁడు. అట్లు చెప్పుటయే కడు మనోజ్ఞముగ దేవీ మహాత్త్వమునకుఁ దగినట్లున్నది. అట్లుకాక ఆమె ప్రాకృత కాంతలవలె వంట చేయు ననుట ఏమి సమంజసము ?

రామ : సరే ! నీవు పెద్ద సమారాధనములు, సంతర్పణ ములు చూచినావా ?

సూర : చూడకేమి ? పెక్కింటిని చూచితిని.

రామ : వానిలో ఎందైనను ఆఁడువారుఁ వంట జేయుచుం డఁగా చూచితివా ?

సూర : వందలమందికి వంట చేయుట ఆఁడువారి వలన నగునా ! దక్షులైన మగవారు కదా చేయుదురు ?

రామ : ఔనా ! మఱి చూడవోయీ ! మీ తాతగారు ప్రవరుని గృహిణిని ఎట్టి వస్తాదునుగా చిత్రించినారో ! ఆమె వేయిమంది వచ్చినను అలయక వంట జేయఁ గలదట. ఆమె నిజముగ మానవియేనా ?

సూర : (నసుగుచు) నిజమే ! ఇది కొంచెము ఇబ్బందిగనే యున్నది.

రామ : దానిని పోనిమ్ము. 'వేవురు వచ్చిరేని' అని యున్న ప్పుడు ఆ వేవు రెవరు ?

సూర : దానికేమి? అతిథులు, అభ్యాగతులు, బంధువులు, భిక్షుకులు అనేక విధములవా రుండవచ్చును.

రామ : అట్లయినచో మకల మూఁడవ పాదమున 'అతిథు లేతేర' అని చెప్ప నెందులకు ?

సూర : (ఆలోచించుచుండును.)

రామ : అనఁగా అతిథు లేతెంచినచే ఆమె అర్ధరాత్రియం దైనను వంట కుపక్రమించునన్నమాట! బంధువులో యితరులో వచ్చినచో వారు పస్తుండవలసిందే కాఁబోలు.

సూర : అట్లెందుకుండురు ?

రామ : అట్లు కాకున్నచో 'వేవురు' అని చెప్పిన తర్వాత 'అతిథు'లని ప్రత్యేకించి చెప్ప నెందులకయ్యా ! అది యటుండనీ; మఱియొకటి చూడుము. 'వలయు భోజ్యంబు లింట నవ్వారిగాఁగ' ఆమె వంటచేసి పెట్టునఁట. ఇంట వస్తువు లే కారణముచేనైన తరుగుపడినచో పొరుగింటికిపోయి అప్పు తెచ్చియైనఁ బెట్టునో పెట్టదో సందేహమే ! ఏమయ్యా ఈ రచనము?

సూర : నిజమే ! బావి త్రవ్వఁగా భూతములు బయల్పడినట్లు ఆలోచించిన కొలఁది అరుచి విషయములే యధికమగుచున్నవి.

రామ : ఇంతెందుకు ? ఈ పద్యమున కావలసినవి రెండు పాదములే !

'అతిథు లేతేర నడికి రేయైన, జెట్టు
నన్నపూర్ణకు నుద్దియా నతని గృహిణి'

తక్కిన రెండు పాదములు దండుగ. దండుగ మాత్రమేకాదు. అవి చేరుట వలననే ఇన్ని యపార్థముల కవకాశము కలుగుచున్నది.

సూర : నిజమే! మీ విమర్శనాపాటవ మమోఘము. మఱి రాయలవారి పద్యమున దోషములే లేవందురా?

రామ : దోషముల సంగతి యటుంచుము. మీ తాతగారు పరివరుని గృహిణిని గూర్చి చెప్పినదంతయు వాచ్యమే కదా! ఈ సంగతినే రాయలవారు ఆ విష్ణుభక్తుని విషయమున వ్యంగ్య మార్గమున చిత్రించినారు. వాచ్యముకన్న వ్యంగ్య మెప్పుడును ఆలోచనా రమణీయముకదా?

సూర : సందేహ మేమున్నది?

రామ : ఆ విష్ణుభక్తుని యింట అర్ధరాత్రి యగునప్పటికి రెండు బంతులు ముగిసి, మూఁడవ బంతి జరుగుచున్నది. భుజించి విశ్రమించి యున్న భక్తులలో కొందఱు నాగేంద్రశయాను పుణ్యకథలతో ప్రొద్దుపుచ్చుచుండగా, మఱికొందరు దివ్యప్రబంధముల ననుసంధానము చేయుచున్నారు. లోపల మూఁడవ బంతికి వడ్డన జరుగుచుండగా యజమానియో, వడ్డించు వారో యెవరో ఉపచార వాక్యములను చెప్పు

చున్నారు. చూచుము. ఆ ఇంటియందలి యాతిథ్యమును కనులకు కట్టినట్లు ఎట్లు చిత్రించెనో రాయల వారు !

సూర : మీరు చెప్పినది నిజము.

రామ : ఈ పద్యమున నొక్క పదమును తీసివేయగలవా ?

సూర : అన్ని పదములు సార్థకముగనే యున్నవి.

రామ : ఎంతమంది భుజించుచున్నారు ? ఎవ్వరు వండిరి ? ఎవ్వరు వడ్డించిరి? ఇంట పదార్థములు సమృద్ధిగా నుండఁగా నిట్లు జరుపుచున్నాఁడా లేక అప్పులు తెచ్చియైనను జరుపుచున్నాఁడా అను విషయములను వాచ్యమొనరింపక యూహకు వదలుటచే, ఆ భక్తుఁడు ఎంతమందికి, ఎంత శ్రమపడి అర్ధరాత్రము వఱకు ఆతిథ్య మొనఁగుచున్నాఁడో కదా ! యని ఆలోచనాధీనులమై మన మాతని కైంకర్యరూప భక్తిని భావించి భావించి పారవశ్యము నొందుచున్నాము. ఈ వ్యంగ్య వైభవము మీ తాతగారి పద్యమునఁ గలదా ?

సూర : నిజమే. ఆ పద్యమున నింత వ్యంగ్యమున కవకాశ మెక్కడిది ?

రామ : ఈ పద్యమును గూర్చి యిట్లంటినని మనుచరిత్రలోని పద్యము లన్నియు నిట్టివిగనే తలంచుచుంటి నని యనుకొనకుము. ధ్వన్యర్థ రమణీయములైన

పద్యములు ఘట్టములును అందనేకములు కలవు. అది యాంధ్రసాహిత్యముననే యపూర్వాలంకారము. ప్రౌఢిమలోని రామణీయకమును గుర్తించుట సులభము కాదనుటకే యింతదూరము చెప్పితిని.

సూర : మీ మాటలను వినుచుండ శ్రీనాథుని పద్యము స్మృతికి వచ్చుచున్నది.

రామ : ఏ పద్యమది ?

సూర : నైషధారంభములోని పద్యము.

చం॥ పసివడి నారికేళఫల
పాకమునం జవియైన భట్టహ
ర్షుని కవితానుగుంభములు
సోమరిపోతులు కొందఱయ్యలౌ
నని కొనియాడ నేర; రది
యట్టిద; లేజవరాలు చెక్కు గీ
టిన పసవల్చు బాలకుఁడు
డెందమునం గరఁగంగ నేర్చునే ?

(శృంగార నైషధము 1 ఆశ్వా. 17 వ పద్యము)

రామ : (నవ్వుచు) ఔను! ఆయన చక్కఁగా చెప్పినాఁడు. అది నీకే అన్వయించుకొనుచున్నావా ? (ముందుకు చూచి) మాధ్యాహ్నికములకు వేళ యగుచున్నట్లున్నది. మీ తాతగారింకను రాలేదే!

సూర : ఇప్పుడే వచ్చెదమని వెళ్ళినారు. అక్కడేదైన ప్రసంగవశమున ఆలస్యమగుచున్నదేమో! ఇంతకు మీరు వచ్చినపని చెప్పలేదు.

రామ : విశేషమేమియును లేదు. మన భువనవిజయముపై దాడి చేయుటకు ఎవరో కవిపరాక్రములు వచ్చుచున్నారంట.

సూర : ఎవరా మహానుభావులు ?

రామ : స్పష్టముగా తెలియుటలేదు. పలురకములుగా వార్తలు వ్యాపించుచున్నవి నంకుసాల నృసింహకవి యొకండట; అతండు తన్నుమించి కవిత్వము చెప్పువాండీ భూమండలమున లేండని, అష్టదిగ్గజములకు తన పేరన్నచో హడలి చచ్చునట్లుగా చేయంగలనని ప్రగల్భములు పలుకుచున్నాండట. మఱియొకండు విద్వజ్జన కోలాహలుండట. ఈ విషయము ముందుగా తాత గారికి తెలిసియుండిన మంచిదని చెప్పుటకు వచ్చితిని.

సూర : ఓహో! వీరి కందఱకు ఏమి యీ సాహసము ! ఇక్కడ కవులందఱు గాజులు తొడిగించుకొని కూర్చుండిరనియా వీరి యభిప్రాయము ?

రామ : గాజులు తొడిగించుకొనకపోయినను కొందఱైనను తమతో చేతులు కలుపుదురేమో యను నాశయుండ వచ్చును.

సూర : మనలో అట్టివారును కలరా ?

రామ : లేకుండుటకంటే ఉండుటయే సహజముకదా !

సూర : అదేమి ?

రామ : ఇందు ఆశ్చర్యపడుట కేమున్నదయ్యా ? మన కిచ్చుటఁగల పదవులను జూచి యువ్విళ్ళూరుచూ మనపై మాత్సర్యము కలవా రనేకులున్నారు గదా!

సూర : ఔను !

రామ : అష్టదిగ్గజములలో కూడ మీ తాతగారి యాధిక్యమును సహింపలేని వారును ఉన్నారు.

సూర : దాని కేమి ? ధూర్జటి మొదలగువారు కలరు కదా!

రామ : ఆయన దేమున్నదోయీ ! అమాయకుఁడు. ఎత్తు వారి చేతిబిడ్డ భట్టుమూర్తి ఎట్లూ గుమన్న నట్లూఁ గును.

సూర : (నవ్వుచూ) మీ కెప్పుడును అతనిపైననే చూపు.

రామ : నా కాతనిపై వైరమేమున్నదోయీ ? అతని కెప్పుడును మనలో నందఱికన్న పై నుండవలయునని యొకటే నిరంతరమైన యాకాంక్ష. తాతగారితో సమానముగ తన్ను సంభావింపఁడని రాయలవారిపై నను వానికి గంటు గలదు.

సూర : నిజమే !

రామ : తాను పైకి వచ్చుటలో పెద్ద ప్రతిబంధము పెద్దన్న గారే యని యాతని యభిప్రాయము. అందువలన

వారి కెవరివల్లనైన సభలో భంగపాటు సంభవించి నచో ఆయనను తొలగించి రాజని ఎల్లరును తనకు బ్రహ్మరథము పట్టుదు రని యాతని యూహ.

సూర : సమర్థుడగు వానికి మహత్త్వాకాంక్ష ఉండుట సహజమే కదా !

రామ : ఆతని సామర్థ్యమును నేను కాదనుటలేదు. అతనివలె పద్యరచన చేయగలవా రెందఱున్నారు? శ్రీనాథ మహాకవి యారంభించిన పద్య శిల్పములకు పౌఢిమను, సంగీత రామణీయకమును సమకూర్చి పరిణతిని కలిగించినవాడు కదా భట్టుమూర్తి! భగవంతు డాతనికి కమనీయమైన కవిత్వకళతో పాటు గాఢమగు అర్థాతురను గూడ నొసంగినాడు.

సూర : 'అర్థాతురాణాం న గురు ర్న బంధుః'.

రామ : ఆతని కర్థసిద్ధియే ప్రధానము. ఒకరి నాశ్రయించి వారియందే విశ్వాసము కలిగియుండవలయునను నియమ మాతనికి లేదు. రాయలవారు కాకున్నచో రామరాజు; రామరాజు కాకున్నచో నరసరాజు.

సూర : అతడును కాకున్నచో తిరుమలరాజు, ఎవరో యొకరు, తన కగ్రస్థాన మిచ్చినఁ జాలును.

రామ : అందువలన రాయలవారి కీర్తిపతాకమైన భువన విజయ గౌరవమును కాపాడుకొనుటలో మన కందఱకును గల పట్టుదల అతనికి లేదు. లేకపోఁగా

మనలో నెవరికి భంగపాటు కలిగినను దానిని పురస్క-రించుకొని తాను ప్రకాశింపవలయుననియే యాతఁడు నిరంతరము యత్నించుచుండును. అది నాకు గిట్టదు. అందువలననే భీష్ముఁడు కర్ణుని ధిక్కరించినట్లు నేనును వానిని ప్రతిఘటించుచుందును.

సూర : అంతయు మనమంచికే యనుకొందును.

రామ : అనుకొనక చేసెడిదేమున్నది సరే! నేను తాతగారిని సాయంకాలము కలసికొందును. నీవు వారికీ విష యమును చెప్పుము...ఎల్లన్నగారెప్పుడు వత్తురో తెలిసినదా ?

సూర : ఈరోజు సాయంకాల గోష్ఠికే వత్తురఁట.

రామ : మంచిది (నిష్క్రమించును)

[సూరన్న అచ్చటి వస్తువులను సర్దుచుండఁగా తెర వ్రాలును.]

# భువనవిజయము

## ద్వితీయాంకము

[ధూర్జటి, మల్లన్న, రామభద్రుఁడు, భట్టుమూర్తి ప్రవేశింతురు. భువనవిజయ సభాభవనమున ఎత్తుగా దూరమున రాయలవారి సింహాసనము. దాని కిరు వైపుల ఆజేసి కుర్చీలు వేయఁబడి యుండును ]

ధూర్జటి : (భట్టుమూర్తిని చూచి) ఏమోయీ! ఇంత త్వరగా పిల్చుకొని వచ్చితివి? సభ ఆరంభమగుటకు చాల సమయమున్నట్లున్నది. ఇంకను దౌవారికులు కూడ వచ్చినట్లులేదే !

భట్టు : మఱేమియునులేదు. మీతో ఏకాంతముగా మనసు విప్పి మాటాడుకొని చాలకాలమైనది. ఇక్కడనే కొంచెముసేపు కూర్చుండి హాయిగా మాటాడుకోవచ్చునని పిలుచుకొని వచ్చితిని. మీ రూరిలో లేకున్నచో మాకు తోఁచినట్లే యుండదు. కూర్చుండుఁడు. (అందఱును కూర్చుందురు.)

ధూర్జ : ఏమీ ! గురువుగారి దగ్గరకు పోవుటలేదా ?

మల్లన : గురువులెవరు? లఘువులెవరు? ఆ సంబంధము చెడి చాలాకాలమైనదికదా !

ధూర్జ : ఈ మధ్య విశేషమేమైన సంభవించినదా ?

రామభద్రుఁడు : విశేషమే యున్నది? ఈమధ్య పెద్దనగారు ఇతనికి సూరన్నకును పరితాపరుదీయము చెప్ప నారంభించినారు; ఇతఁడు చాపలముతో నొకటి ప్రకరణము ముగియకముందే అందులోని శ్లోకములఁ దెలుఁగుచేయ నారంభించినాఁడు.

ధూర్జ - భట్టుమూర్తి సామాన్యుఁడా మఱి?

రామభ : ఆ పద్యము లెట్లో సూరన్న మూలమున కాఁబోలు ఆయనదాఁక పోయినవి. అది నెపముగాచేసి ఆయన యితనిని తలవాచునట్లుగా చీవాట్లు పెట్టినాఁడు. 'శాస్త్రమును చదువఁదలచుఁకొన్నచో అది పూర్తి యగు వఱకు నీవు కవిత్వమును కట్టి పెట్టవలసినదే. లేకున్నచో నీకు పాఠము చెప్పను' అని ఆయన ఖండితముగా చెప్పెను.

ధూర్జ : మీకట్టి శ్రమ యెందులకని ఇతఁడే మాను కొన్నాఁడు. ఇంతేనా?

భట్టు : ఔను. అసలాయనకు నేను వసుచరిత్ర మారంభించి నప్పటినుండియు కన్నెఱ్ఱ గానేయున్నది. రామరాజు గారు నా పద్యము ను విని 'పెద్దనగారి పద్యములను మించియున్నవే' అని ప్రశంసించినారని విన్నప్పటి నుండియు ఆయనకు ఆవ్రతాగినట్లున్నది.

మల్ల : ఏదో శిష్యుఁడు వర్ధిష్ణువుకదా ! ఇతని విషయమున ఆయనకుమాత్రమంత మాత్సర్య మెందులకు? శిష్యుని

కీర్తి కుమారుని యశమువలె తనకును ప్రాభవ
కారణమే కదా !

భూర్జ : కాని ఒక విషయము మాత్రము గమనింపవలసి
యున్నది. ఆయనకు ఈతనియందు ఈర్ష్యాసూయ
లున్నవో లేవో నాకు తెలియదు. ఆయన సూరన
న్నను కూడ నిట్లే శాసించి యుండు ననుకొందును.

రామభ : వానిది ఇదేగోల ! పద్యములు వ్రాసి తాతగారికి
చూపుటకు భయపడి వారికి వీరికి చూపుకొని యుఘో
రించుచుండును. ఎప్పుడో సూరన్న భార్య తాతగారికి
చనువుచొప్పున భర్త వ్రాసినదని యొకపద్యము
కుతూహలముతో వినిపించెనంట. 'మొదటనే
మూడు విఱుపులా! ఇదియేమి పద్య' మని యీస
డించుకొని 'అసలు వీనికిప్పుడే పద్యములతో నేమి
పని' అని తాండవము చేసినాడంట. ఆనాటినుండి
యతడు పదిరోజుల వఱకు ఆయనకంట పడలేదు.

భూర్జ : ఔనండీ ! ఆయన యభిప్రాయము వీరిద్దఱు అసలు
కవిత్వము మానుకోవలెనని కాదుకదా ! పుట్టుకతో
వచ్చిన శక్తి అదిమిపెట్టిన ఆగునా ? అంతమాత్ర
మాయనకు తెలియదా యేమి ?

మల్ల : ఏమి తెలియునో ఏమి తెలియదో ! ముందు వీరి
యందు పొంగుచున్న కవిత్వముపై మాత్రము నీళ్ళు
చల్లుచున్నాడు.

ధూర్జ : మంచిపని చేయుచున్నాఁడు. ఇందులో తప్పేమి యును లేదు.

భట్టు : మీరును అట్లే యందురా ?

ధూర్జ : యథార్థమంతెనోయి ! కవిత్వమొక వ్యసనము. అది శాస్త్రవిద్యాభ్యాసమునకు విరోధి. శాస్త్రము చక్కఁగా పట్టవలయునన్నచో బుద్ధిశక్తుల నన్నింటిని దానిపై కేంద్రీకరించిననే అది పట్టుట అంతంత మాత్రము. మధ్యలో కవిత్వము తగిలినచో శాస్త్రము రుచించునా ? అందు బుద్ధి ప్రసరించునా ? ఒకరి దాఁక ఎందులకు? నాగతియు నిట్టిదే. తర్కవ్యాకరణ ముల నారంభించి కవిత్వమువలననే పై గ్రంథము లకు తిలోదకములు నీయవలసి వచ్చినది.

మల్ల : పెద్దన్నగారికిని ఇట్టి యనుభవమే కలదని యందురు.

ధూర్జ : కవిత్వములో నెప్పుడైనను ఘనతను సాధింప వచ్చును. కాని ఒక వయస్సు దాటినచో శాస్త్రము లందు పట్టుచిక్కదు. వీరిద్దఱును మంచి పండితులై ఆపైన మహాకావ్యకర్తలు కావలయునని అయన యభిప్రాయమై యుండును.

భట్టు : మీరు చాల ఉదారులు కాబట్టి మీ కందఱును నట్లే కనిపింతురు. మఱి రాయలవారితో చెప్పి మీ కిద్దఱ కాస్థానప్రవేశమును కలిగించినవాఁడు ఆయ నయేకదా !

ధూర్జ: సూరన్న మనుమరాలిభర్త కాఁబట్టి 'ఇంటిలోని పోరు ఇంతింత కాదయా' అన్నట్లు అతనిని ఆస్థానములో ప్రవేశపెట్టక తప్పలేదు. ఇంక అతనిని ప్రవేశపెట్టిన తరువాత నన్నుపేక్షించినచో లోకమంతయు తన్నాడి పోసికొనునని నన్నుకూడ ప్రవేశపెట్టినాఁడు.
(ప్రక్కకుచూచి) ఎవరది ?

తిమ్మప్ప : ప్రవేశించి) అయ్యా! దండాలండీ బాబయ్యా! దండాలు. (నమస్కరించును.)

ధూర్జ : ఏమి ? బాగున్నావా తిమ్మప్పా ?

తిమ్మప్ప : తమ దయవల్ల బాగానే ఉన్నాను బాబయ్యా!

భట్టు : తిమ్మప్పా! నీవలన ఒక చిన్నపని కావలసియున్నది. చేయుదువా ?

తిమ్మప్ప : చిత్తము! సెలవీయుండి.

భట్టు : తిమ్మరుసుగారు ఎక్కడున్నారు ?

తిమ్మప్ప : కార్యాలోచన మందిరములో ఏవో లెక్కలు చూచుకొనుచున్నారు.

భట్టు : ఓహో! సరే. నీవుపోయి ధూర్జటిగారు, మల్లన్న గారు, రామభద్రయ్యగారు సభాభవనము దగ్గఱ వారి రాక కెదురుచూచుచున్నారని, చాల నేవుగా వారి కుమారుని పెండ్లివిషయమునే ఘనముగా చెప్పుకొనుచున్నారని చెప్పి ఏలాగైన వారు వెంటనే బయలుదేరి వచ్చునట్లుగా చేయవలె. ఘూతముకదా

నీ ప్రజ్ఞ! ఇదిగో నీకు పారితోషికము. (ఒక వరహా తీసి యిచ్చును.)

తిమ్మప్ప : చిత్తము! చిత్తము! (చేయి చాపుచునే) ఇంత మాత్రమునకు పారితోషికమెందుకు బాబయ్యా! తమ దయ ఉండిన చాలు (స్వీకరించును.)

ధూర్జ : ఏమో! పెద్ద ఎత్తు వేసినావే? ఏమికథ?

భట్టు : తిమ్మప్పా! నేనిక్కడ నుంటినని చెప్పెదవు సుమా!

తిమ్మప్ప - తమరు వద్దన్నచో ఎందుకు చెప్పెదును? మఱి సెలవా? పోవును)

రామభ : మన భట్టుమూర్తి తిమ్మరుసుగారి వలన అగ్రహారము పొందినాఁడు.

ధూర్జ : అలాగా! చాల సంతోషము. మాటమాత్రమైన అనలేదే. ఔనులే! ఎట్లయినను అగ్రహారికుఁడవై తివి మాతో నిఁక నేమి?

మల్ల : మన భట్టుమూర్తి అట్టివాఁడు కాదు. మీకు తెలిసి యుండుననియే అతఁడు చెప్పియుండడు.

భట్టు : నేను మీ విషయమున అట్టి అపచారము చేయుదునా? అసలు నేను అగ్రహారికుఁడ నైనఁగదా?

ధూర్జ : అనగా?

భట్టు : ఇప్పటికి వాగ్దత్తాగ్రహారుఁడనే.

ధూర్జ : ఇంకను ఆయన నీకు దానశాసనము వ్రాయలేదన్న మాట! అసలాయన నీకు అగ్రహారమిత్తునని ఎప్పుడు వాగ్దానము చేసెను?

మల్ల : అది యొక చరిత్ర. తిమ్మరుసుగారి కుమారుని వివాహము సంగతి మీకుఁ దెలియునుగదా!

ధూర్జ : జరిగినదని మాత్రము తెలియును. వివరములం తెలియవు. మీ కందఱకును ఘనముగా సమ్మానములు జరిగెనా?

రామభ : క్షేమము పోయినగదా సమ్మానములు. వారి యీవి జగత్ప్రసిద్ధము. పెండ్లిపిలుపునందే అది వ్యక్తమైనది.

మల్ల : తానుగాకపోయినను, తన తమ్ములనో, బంధువులనో పంపి పెండ్లికి పిలువవచ్చునుకదా! మఱి పురోహితుని భృత్యులను బంపి శుభలేఖలు బట్వాడా చేసినాఁడు.

ధూర్జ : ఆయన అంత మర్యాద తెలియనివాఁడా!

మల్ల : మర్యాదలు తెలియకేమి? అంతకన్నను మనమందఱము చేరినచో సత్కారములకిందనే చాల వ్యయమగునని బాగుగా తెలియును.

ధూర్జ : అంతటి లోభియా? నాకు తెలియదే! సరే.

భట్టు : లోభమునకేమి? లోకమున పెక్కురు లోభులు కలరు. వారెకి కీర్తిపై కాంక్షయు నంతగా నుండను.

మఱి యీాయనకు తాను వట్టి తాంబూలమైన నీయు కున్నను తన పదవిని చూచి ఎల్లరును తన్ను పొగడు చుండవలయునని కోరిక మాత్రము మిక్కుటము.

ధూర్జ : (నవ్వుచు) ఈ విద్యయందు నీవేమి తక్కువ వాఁడవా!

రామభ : భట్టుమూర్తి యట్టివాఁడు కాదు. పట్టుదలతో నార్జించినట్లే, గుట్టుచప్పుడు కాకుండ నడిగినవారికి లేదనకుండ నీయఁగలఁడు.

మల్ల : అతఁడు పైకి కన్పింపఁడు కాని, అందినచో అగ్ర హారములుకూడ దానమీాయఁగలఁడు.

ధూర్జ : (నవ్వుచు) మీాకేదో కొంత యితని యీావి సోకి నట్లున్నదే !

రామభ : దానికేమి! ఉన్నమాట యనుకొనవలె గదా ! ఎప్పుడో ఉత్సవ దినములలో తప్ప రాయలవారి వలన నిరంతరము అర్థాగమ ముండదు మఱి సంసా రములో ఎద్దడి తగిలినప్పుడు వచ్చితి చిన్న విషయము నకు వారియొద్దకు పోలేము గదా !

మల్ల : పండుగలకు పబ్బములకు మాటమాత్రి మీాతనికి కబురు చేసిన చాలు, రెండవ కంటివానికి తెలియ కుండ సకల పదార్థములను నమకూర్చుచుండును.

ధూర్జ : (నవ్వుచు భట్టుమూర్తిని జూచి) ఏమో అనుకొంటిని. గట్టివాఁడవే. అర్థులయెడ నౌదార్యము లేనివారికి కావ్యార్థములలో మాత్రి మదియెట్లు కలుగును? మహోదారుఁడు కానివాఁడు మహాకవి యగునా? ఇంతకు ఆ మహామంత్రిగారి జాలమున నీ వెట్లు వడితివి ?

భట్టు : అంతయు దైవికము! ఇక్కడనున్న పెద్దలంపఱును, ఏదే నొక నెపముతో పెండ్లివారితో బయలు దేర కుండ తప్పించుకొనిరి.

రామభ : దానినిఁగూర్చి ఆయన పట్టించుకొనినట్లు కూడ లేదు.

భట్టు : నేనును ఆ సమయమున మా బంధువులను జూడఁ బోయి కృష్ణామండలములోని నరిపల్లియొద్ద నుంటిని.

ధూర్జ : ఆయన సంబంధము చేసినదికూడ ఆ ప్రాంతముననే అనుకొందును.

భట్టు : ఔను, బెజవాడలోగదా వివాహము జరిగినది! కన్యాదాత మిక్కిలి యుదారుఁడు ఆయన స్వయముగావచ్చి ముందుగనే కవులను పండితులను మిగుల నాదరముతో నాహ్వానించినాఁడు. నేను రాయలవారి యాస్థానములోని కవినని తెలిసి తప్పక రావలసిన దని బలవంత పెట్టినాఁడు.

ధూర్జ : పెద్దచిక్కే వచ్చినదే నీకు. కన్యాదాతవైపు వాఁడ

వుగా పోయినచో తిమ్మరుసుగారి గౌరవమునకు లోపము కదా!

భట్టు : అందులకనియే నేను పడరానిపాట్లన్నియు బడితిని. మాబంధువులను బంపితిని, నేను దగ్గఱలోనే యున్నట్లు తెలుపుడని; నేనే చివరకు పోయితిని. అప్పటి కాయన "ఏమోయీ! చూచితివా! మన వారెవరును రానేలేదు. నీవైనను ఈ నాలుగురోజు లిక్కడనే యుండుము" అని మామూలు మాటగా ననెను.

ధూర్జ : అంతమాత్ర మాహ్వానించిన చాలుకదా!

భట్టు : లగ్నమునాడు కన్యాదాత కాశీశ్రితుడు విద్వజ్జన కోలాహలుడను నొక కవి సార్థకనాముడు గనే సభలో లేచి ఇతరుల నెవరిని మాటాడనీయక తానే సంస్కృతమున తెలుగున కన్యాదాతను ప్రశంసించుచు పద్యములు చెప్ప మొదలుపెట్టెను. తక్షణమే కన్యాదాత ఆయనను చందన తాంబూలాదులతో సత్కరించి కొంతభూమిని మాన్యముగా దాన మొసంగెను.

ధూర్జ : ఇంకేమి! దానితో ఆయన ప్రశస్తి మిన్నంటి యుండును. మహామంత్రిగారి మాటయే ఎవరికిని పట్టి యుండదు. (నవ్వుచు) అదిసరే! నీవు కూడ కన్యాదాత ప్రశంసకే కడంగితివా?

భట్టు : తప్పేమున్నది? ఒక కవినాయన అంత ఉదారముగా సత్కరించుచుండుట ఎవరికైన సంతోషకారణమే కదా! నాకును ఆయనపై అఖండముగ ఆశువు చెప్పవలయు నన్నంత ఆవేశము కలిగి లేచితిని.

ధూర్జ : ఆయన నిన్నుకూడ ఆహ్వానించియే యున్నాఁడు కదా !

భట్టు : కావుననే నాకును అవకాశము కలిగినది. కాని ఆవులించినచో ప్రేవులు లెక్కపెట్టువాఁడు కదా తిమ్మరుసయ్య. తక్షణమే లేచివచ్చి చాల ఆప్యాయముగా నా భుజముపై చేయివైచి ప్రక్కకు తీసికొనిపోయి "భట్టుమూర్తీ! మనపరువు నీవు కాపాడవలెను. లేకున్న మన విజయనగరమునకే అప్రతిష్ఠ" అని గడ్డము పట్టుకొని బ్రతిమలాడఁజొచ్చెను.

ధూర్జ : అప్పుడు నీవు బేరము పెట్టితివన్నమాట. నీరొట్టె విఱిగి నేతిలో పడినదిలే.

భట్టు : బేరమే మున్నది. అప్పుడు కాకున్నచో మఱియొకప్పుడీయన మనకు లొంగివచ్చునా? "అయ్యా! నేనును పేదవాడను కదా! ఆయన అనుగ్రహించిన ఆ కోలాహలునకిచ్చినంత కాకున్నను ఏదో చిన్న మాన్యమైన ఈయఁడా? మీరును కొంచెము చెప్పి పుణ్యము కట్టుకొనుడు. కన్యాదాత మీ మాటను కాదనునా?" అని కడు వినయముతో ప్రార్థించితిని.

రామభ : మాటలతో చురకలు వేసితివి కాని వినయము నకు లోపమేమున్నది.

ధూర్జ : దానికి ఆయన ఆపాదమస్తకము మండియుండును.

మల్ల : అట్లు బయట పడువాఁడా తిమ్మరుసయ్య !

భట్టు : కార్యదాహమున నాగ్రహమును చంపుకొని "నేనేమి అంతమాత్రము ఈయలేని వాఁడనా? అంత లోభి ననుకొంటివా? వారియొద్ద మాన్యములకై చేయి చాపవలసిన దుర్గతి నీకేమున్నది?" అని సముదాయింప మొదలుపెట్టెను.

ధూర్జ : నీవు లొంగుదువా ? ఆయనది నారికేళ పాకమైనచో నీది అయఃపాకము కదా !

మల్ల : అట్లు కాకున్నచో అక్కఱ తీరినతరువాత అధికారులు మన మొగము చూతురా !

ధూర్జ : తరువాత.

భట్టు : "మీరు ఈయలేని వారని ఎవరందురు అంతమాట నేనందునా ? కన్యాదాతస్థాయి ఎక్కడ మీ స్థాయి ఎక్కడ ? మీ రనుకొన్నచో అగ్రహారములే యీయఁగలరు గదా ?" అని యంటిని. ఆయన అర్ధాంగీకారముతో "సరే కానిమ్ము ! నీవేమి సామాన్యుఁడవా ?" అని యూరకుండెను.

ధూర్జ : ముందటి కాళ్ళకు బంధము వైచితివే !

భట్టు : తరువాత సభలోనికిపోయి "మామహామంత్రి గారి ప్రాభవము సామాన్యమా! సదస్యమునందు కదా వెల్లివిరియును. మీ రందఱును వారి ప్రశస్తిని యౌదార్యమును అప్పుడే రుచి చూడఁగలరు. మఱి యిది కన్యాదాన సభ. ఇందు కన్యాదాతగారి ప్రశంసయే సమంజసము" అని కన్యాదాతను ప్రశంసించుచు పద్యములను చెప్పి వధూవరుల ఆసీర్వదించితిని.

రామభ : ఇతని కంఠ మాధుర్యమునకు పద్యముల చమత్కృతికి అందఱును పరవశులై నారట. కన్యాదాత మిగుల సంతోషించి వస్త్రములిచ్చి జోడుశాలువలిచ్చి వరహాలతో నింపిన వెండి పళ్ళెరము నొసంగి సత్కరించెను

మల్ల : ఎట్లైనను అదృష్టశాలి.

ధూర్జ : ముత్తముమీఁద పెద్దఎత్తే ఎత్తినావు! తరువాత.

భట్టు : సదస్యము వఱకు నే నూఱకనే యుంటిని. ఆయనయును ఆ ప్రస్తావనయే చేయలేదు. సదస్యము రానే వచ్చినది. కోలాహలుఁడు సభలో లేచి "తర్కమునఁగాని వ్యాకరణమునఁగాని శాస్త్రార్థముచేయుదుమా!" అనెను. నేను లేచి "నీవీమోక్షణవేళాయాం వస్త్రమూల్యపరీక్షణమ్" అన్నట్లు వివాహముల వేడుకలో కర్కశమైన తర్కమెందులకయ్యా! సరసజన మనోరంజనముగా సత్కవిత్వమునే ఆరంభింత"మని ఆశువునందుకొంటిని.

ధూర్జ : చాల తెలివిగా తప్పించుకొన్నావే !

భట్టు : కావ్యశైలిలో తిమ్మరుసుగారి వంశమును వర్ణించి, వారిపై ఉదాహరణ కావ్యమును చెప్పి వధూవరుల నాశీర్వదించితిని. ఆయన సంతోషముతో లేచి కన్యాదాత యిచ్చినట్లే, వస్త్రములు, శాలువలు, వరహాలు తెచ్చెను.

ధూర్జ : అంతేనా ?

మల్ల : అదికూడ కన్యాదాత యిచ్చియుండుటచే నంత మాత్రమైన ఈయకున్నచో బాగుండదని తెచ్చి యుండును.

భట్టు : నాకు చాల కోపము వచ్చినది. అయినను తమా యించుకొని "అయ్యా ! ఇది ఉంచుడు. తరువాత నెప్పుడైన తీసికొందునులే" అని యంటిని. "నీకేమో అసంతృప్తిగ నున్నట్లున్నదే ! ఏమి కావలయునో అడుగరాదా ?" అని గోవిందరాజు పలికెను.

ధూర్జ : నీ కనుకూలముగానే చెప్పినాడే!

భట్టు : "అయ్యా ! వారు విజయనగర సామ్రాజ్యమునకు మహామంత్రులు, మీరు దండనాథులు, మీ యంత స్తునకు తగినట్లు మీరు సత్కరింపవలెగాని నే నడుగుట భావ్యమగునా !" అని పలికితిని. ఇంతలో వరుడు కల్పించుకొని "అతని యభిప్రాయము అగ్ర హారము కావలెనని ఏమో" అని పలికెను ఆమాటతో

నందఱును "నిజము, నిజము, అది సముంజసము" అనఁజొచ్చిరి.

ధూర్జ : మంత్రిగారు మంచి చిక్కులోనే పడినారన్నమాట.

భట్టు : "సరే, అట్లయినచో నీకు ఏ అగ్రహారము కావలయునో అడుగుము" అని ఆయన మందహాసముతో నుత్తరువిచ్చెను. "దానికేమి! ఈదావులోనే యున్న సరిపల్లెను ఇప్పింపుఁడు" అని యంటిని.

ధూర్జ : మంచి గ్రామమునే పట్టితివే.

భట్టు : ఆయన సంతోషమును నటించుచు కొంచెమాలోచించి, "అది కేవలము నాక్రిందలేదు. రాయలవారితో చెప్పి యిప్పింతునులే" అని పల్కెను. చిత్తమంటిని. ఆనాఁటినుండి ఈనాఁటి వఱకు వారిప్పించుచుచునే యున్నారు. నేనుపుచ్చుకొనుచునే యున్నాను.

ధూర్జ : ఓహో? యిదియా సంగతి! సరే! వసుచరిత్రమెంతవఱకు వచ్చినది?

మల్ల : అక్కడక్కడ కొన్ని ఘట్టములు వ్రాయుచున్నాఁడు. గిరికా విలాపము చక్కఁగా కుదిరినది.

రామభ : అసలు వసువు రాలినగదా! చరిత్రము జరుగుటకు.

ధూర్జ : ఓహో! కాసులు రాలలేదన్నమాట. రామరాజుగారు కూడ తిమ్మరుసుగారి కెందును తీసిపోరనుకొందును.

మల్ల : ఇతఁడు ఆయన వెంటఁబడి తిరుగుచుండుటచే "రామ రాజ భూషణుఁ" డని బిరుదు దక్కినదే కాని, నగదు చిక్కలేదు.

ధూర్జ : ఇంతకును ఆ గ్రంథము నాయన కంకితమీయవా ఏమి?

రామభ : ఆయనకే ఈయవలయునని ఏమున్నది! ఎవఁడు ఘనముగా సత్కరించిన వానికే యిత్తును. ఆయన కేమి అక్కఱపట్టినట్లు లేదు. ఆయన కాకున్నచో తిరుమలరాజు.

మల్ల : అతఁడును కాకున్నచో తిమ్మరాజు, ఎవఁడో ఒకఁడు. ఔదార్యము కదా ముఖ్యము!

భట్టు : ఏమి కావ్యములో, ఏమి అంకితములో! పత్రివాఁడు పద్యములు చెప్పమనువాఁడే కాని పట్టుమని పదికాసు లిచ్చువాఁడు లేఁడు కదా!

మల్ల . (నవ్వుచు) ఇంతకును డబ్బుకొఱకేనా కవులందఱు కవిత్వము చెప్పుచున్నది?

భట్టు : (కొంచెము కోపముతో) మీరందఱు మహాయోగుల వలె మాటాడుదురు అవకాశము దొరికినచో అందఱును చేయి చాపువారే. ఒకరిమాట నాకెందులకు? నాకు మాత్రము పదికాసులు కంటఁబడనిదే పద్యము పుట్టదు. మీరేమనుకొన్నను సరే.

రామభ : దాని కేమిలే! లోకములో నున్న న్యాయమే యిది. కడుపు నిండినఁగదా కవిత్వము పుట్టుట.

ధూర్జ : మీ గురువుగారు చెప్పియే యున్నాఁడు గదా!

చం॥ నిరుపహతి స్థలంబు, రమ
ణీ ప్రియదూతిక తెచ్చి యిచ్చు క
ప్పుర విడె, మాత్మ కింపయిన
భోజనముయ్యెల మంచ, మొప్పు త
ప్పరయు రసజ్ఞు, లూహ తెలి
యంగల లేఖక పాఠకోత్తముల్
దొరకినఁ గాక, యూరక కృ
తుల్ రచియింపుమఁటన్న శక్యమే!

(చాటు - మంజరి. 1 భా. 153 పు)

భట్టు : ఆయన కేమి? రాయలవారి వంశమును చంద్రమండలమున కెక్కించి అగ్రహారములతో అఖిలైశ్వర్యములను అనుభవించుచున్నాఁడు.

మల్ల : మించిపోయిన దేమి? నీవును వారి వంశమును సూర్యమండలమున కెక్కింపరాదా?

రామభ : అట్లైనను ప్రయోజనముండునా? అంత మాత్రమునకే రాయలవారు లోఁబడుదురా? పెద్దన్నగారు ఈ శిష్యునకు కవిత్వకళను నేర్పెనే కాని, అసలు విద్యను చెప్పనేలేదు.

ధూర్జ : ఏమది?

రామభ : ఆశ్రీయుణ విద్య! పిల్లి పులికి అన్ని విద్యలు చెప్పి చెట్టెక్కుట మాత్రము చెప్పలేదట.

భట్టు : అబ్బో! ఆ విద్యలో ఆయన యింకొకని పారంగతుని జేయునా?

ధూర్జ : భట్టుమూర్తీ! ఆయన విషయమున మేము సమవయస్కులము కాబట్టి ఎట్లైన మాటాడవచ్చును. నీవు శిష్యుడవై యుండి ఇట్లు మాటాడుచుండుట మంచిది కాదు. దానిని పోనిమ్ము. నీ కాశ్రయమే కావలసియున్నచో నేను కల్పింపనా? ఒకపని చేయుదువా?

భట్టు : (ఆశతో) చెప్పుడు! మీమాట నెప్పుడైన కాదంటినా?

ధూర్జ : నరసరాజు నెఱుగుదువా?

భట్టు : ఎవరాయన ?

ధూర్జ : రామరాయుల వారి మేనల్లుడయ్యా! లక్కాంబ కుమారుడు.

భట్టు : ఓహో! అతడా! తొరగంటి దుర్గాధిపతి. నాకు ఆయనతో అంతగా పరిచయము లేదు, అతడు రసజ్ఞుడా?

ధూర్జ : ఉదారుడు కూడ. నాయందు చాల గౌరవభావము కలవాడు. ఇటీవల ప్రసంగవశముగా "గ్రంథ

మన్నచో ప్రతాపరుద్రీయమే కదా గొప్ప గ్రంథము. విద్యానాథుఁడెంత చక్కఁగా వ్రాసి నాఁడండి. అలంకారశాస్త్రమునంతను పిండిపెట్టి నాఁడు గదా! ఆ ప్రతాపరుద్రుని అదృష్టమే అదృష్టము. అంకితమన్నచో నట్లుగదా యుండవలె” అని చాల ఆశతో మాట్లాడినాఁడు.

రామభ : మీరు దానిని ఆంధ్రీకరించి ఆ విధముగా తనకు అంకితము చేయవలయునని అతని యాశ కాఁబో లును.

మల్ల : తగినంత ప్రతిఫలమున్నచో అందు తప్పేమున్నది ?

ధూర్జ : ఆ విషయమున సందేహమేమియును లేదు. చెప్పి తినికదా మిగుల నుదారుఁడని. నా కతనిపై వాత్సల్యము గలదు. ప్రతి పద్యమున నాతని పేరు వచ్చునట్లుగా గ్రంథమును రచించుటకు మాత్రము మనసొప్పుటలేదు. ముదిసిఁ ముప్పునఁ బడుచుండఁగా, ఈశ్వరునిపై నిలువవలసిన మనస్సును ఇతరులపై నిల్పుటెట్లు? వారెంత మంచివారే కానిండు. అందు లకే ఒక నిశ్చయమునకు వచ్చితిని.

రామభ : ఏమది !

ధూర్జ :

శా॥ రాజుల్ మత్తులు; వారిసేవ నరక
ప్రాయంబు; వా రిచ్చు నం

భోజాక్షీ చతురంత యాన తురగీ
భూషాదు లాత్మవ్యథా
బీజంబుల్; తదపేక్ష చాలుఁ; బరితృ
ప్తిం బొందితిన్; జ్ఞాన ల
క్ష్మీ జాగ్రత్పరిణామ మిమ్ము దయతో
శ్రీ కాళహస్తీశ్వరా!

శా॥ నీకుం గాక కవిత్వ మెవ్వరికి నే
నీ నంచు మీఁదెత్తితిన్
ఛేకొంటిన్ బిరుదంబుఁ, గంకణము ముం
జేఁ గట్టితిన్, బట్టితిన్
లోకుల్ మెచ్చ వ్రతంబు, నా తలఁపు తీ
రున్ భీరుత్వంగాదు, ఛీ!
ఛీ! కాలంబునరీతి తప్పాడు సుమీ
శ్రీ కాళహస్తీశ్వరా!

రామభ: ఎంత చక్కఁగా చెప్పినారండీ! పోతన్నగారి తర్వాత ఇట్లు ధీరత్వముతో చెప్పఁగలవారు. మీకు దప్ప మఱియొకరు లేరు.

ధూర్జ: నేను ఇచ్చటికి వచ్చుచుండుట మీ యందఱితోడి గోష్ఠికే గాని సత్కారముల కొఱకుఁ గాదు.

మల్ల: అది నిజమే. మాకును తెలియును. మిమ్ముచూచి మేమందఱమును సిగ్గుపడవలసియే యున్నది.

ధూర్జ: అట్లనుకొనవలసిన దేమున్నది? అందఱి పరిస్థితులు ఒకరకముగా నుండవు. కుటుంబము పైఁబడినవారు

దానిని నిర్వహించుటకై ఎన్ని పాట్లైనఁ బడవలసి యుండును. అది వారి తప్పుగాదు. విద్వాంసులను దరిద్రులనుగా సృష్టించిన బ్రహ్మదేవునిది

శా॥ వేధం దిట్టఁగ రాదు; గాని భువిలో
విద్వాంసులం జేయ నే
లా?; ధీచాతురిఁ జేసెఁ; జేసిన గులా
మా పాటనే పోక క్షు
ద్బాధాదుల్ గలిగింప నేల!; అది కృ
త్యంబైన; దుర్మార్గులం
ఛీ! ధాత్రీశులఁ జేయ నేటి కకటా!
శ్రీకాళహస్తీశ్వరా!
(శ్రీ కాళహస్తీశ్వర శతకము)

భట్టు: ఆహా! ఏమి కవిత్వము! ఇంత అకృత్రిమముగా భావమును వ్యక్తీకరించుట నే నెచ్చటను చూడలేదు. తెలుగు కవిత్వములోని తీయఁదనమంతయు మీ పద్యములలో మూర్తీభవించి యున్నది.

ధూర్జ: సరే! దానికేమిగాని, నీవు ఆ నరసరాజు కోరినట్లు ఆ గ్రంథము ననువదింపగలవా? నీకు ఆ గ్రంథములో పైభాగములలో పాఠము కావలసినచో నేను చెప్పుదును.

భట్టు: తప్పక అనువదింతును. మీ యాదేశము మహాప్రసాదము గదా! అంతకన్న కావలసిన దేమున్నది? మీకు కలకాలము కృతజ్ఞుఁడనై యుందును. షణి...

ధూర్జ : ఇంకేమున్నది, నీవే చెప్పితివికదా! పద్యమునకు పది కాసులని?

భట్టు : మీరును అట్లు మాటాడినచో నెట్లు? మీరు సాక్షాత్తు ధూర్జటులు. మీమిత్రుఁడు కుబేరుఁడే. నేనేదో మాటవరుస కన్నదానినే నిశ్చయము చేసిన నెట్లు?

మల్ల : నీ యభిప్రాయ మేమో స్పష్టముగ చెప్పరాదా! వారి దగ్గఱ దాపఱిక మేమి?

భట్టు : వారి దగ్గఱ నాకు సంకోచమేమున్నది? పెద్ద గ్రంథము గదా! పది యూళ్లైన నిప్పింపు డని.

ధూర్జ : (నివ్వెఱపడి) పదియూళ్లా! (నవ్వుచు) ఆశకైన అవధి యుండవలెనయ్యా!

భట్టు : మీకే అదియంత వెక్కసమైనచో నేనేమి చెప్పఁ గలను? పోనిండు అయిదూళ్ళను అడిగి చూతుఁడు.

ధూర్జ : ఆతని క్రిందనున్నవే నూఱు గ్రామములను కొందును. అందులో ఐదింటినైన ఇచ్చుట సామాన్యమా? సరే! సరే! దానికేమి? ప్రయత్నింతము.

భట్టు : (వినయముతో) ఈ యుపకారము చేసినచో మీ మేలును జన్మజన్మములకు మఱువను.

ధూర్జ : నీ వింతగా జెప్పవలెనుటయ్యా! (ముందుకు చూచి) అదిగో! తిమ్మరుసుగారు వచ్చుచున్నట్లున్నది. (అందఱు సంభ్రమముతో లేచి నిలుచుందురు.

ధూర్జటి తిమ్మరుసునకు ఎదురుగా నడుగులు వేయఁగా భట్టుమూర్తి యందఱ వెనుకకు పోవును.)

ధూర్జ : అమాత్యవర్యా! అభివాదనములు.

తిమ్మ : మహాకవీ ! నమస్కారము కుశలమా !

రామ : ఆర్యా! నమస్కారములు.

మల్ల : ఆర్యా ! అభివాదనములు.

భట్టు : (ముందుకు వచ్చి) మంత్రిశేఖరా! ప్రణామములు.

తిమ్మ : (మొగము చిట్లించి - నవ్వి) నీవును ఇక్కడనే యుంటివా ?

భట్టు : తమ సన్నిధియే కదా మాకు పెన్నిధి!

తిమ్మ : ఈ పొగడ్తల కేమిలే ?

భట్టు : తమకు నాకు అగ్రహారము సమగ్రహించుట అబద్ధమా ?

తిమ్మ : అబద్ధము లేదు. సుబద్ధము లేదు. ఏదో మాటవరుస కన్న దాని కింత నిలువఁదీయుదు వేమి ?

భట్టు : (తక్కినవారి వంకఁ జూచి) చూచితిరా ! ఆయన మాటనెట్లు మార్చుచున్నాడో ! ఇంతవారే ఇట్లు మాటతప్పినచో నింక న్యాయ మెక్కడిది ?

తిమ్మ : ఇందు న్యాయమున కేమున్నది ? నాల్గుపద్యముల నల్లినంత మాత్రమున అగ్రహారము లిచ్చుచుందురా ? ఇదియొక న్యాయమా ?

భట్టు : రాయలవారు పెద్దన్నగారి కిచ్చినప్పుడు ?

తిమ్మ : అది యొక పెద్ద వ్యసనము. సద్వ్యయమని ఎవ రందురు! ఆయన కిచ్చుట వలననేకదా, తమకును అట్లే లభించునని ప్రతిదినము కవులు నేల యీనినట్లు వచ్చుచున్నారు ?

భట్టు : ప్రభువుల ఈవి దిశదిశలకు ప్రసరించుచున్నది. అందు వలన కవులట్లు వచ్చుచున్నారు. అది సహజమేగదా!

కం॥ ఏ తెంతురు తమ్ముఁ దామే
దాతలసన్నిధికి నర్థితతు లుర్విఁ; శుక
వ్రాతమునకుఁ జూతమహీ
జాత మ్మంపినదె కమ్మ? సాళువ తిమ్మా!
(చాటు. మణి మంజరి II భాగము 109 పుట)

తిమ్మ : నేను ఈ కవిత్వములకు లొంగువాఁడను కాను

భట్టు : మాట యిచ్చి తప్పినచో నేనును మన్నించువాఁడను గాను.

తిమ్మ : కాకున్నచో నేమి చేయుదువు ?

భట్టు : (కోపావేశముతో) ఏమిచేయుదునా !

ఉ॥ లొట్ట యిదేటిమాట? పెనులోభులతో మొగ
మాట మేల, తాఁ। గుట్టకయున్న వృశ్చికముఁ
గుమ్మరపుర్వు వి యందురే కదా ;। పట్టపురాజుఁ
బట్టి సరిపల్లె సరాసరి యీయకున్న నే ।
దిట్టకమాన నామతము ; — — — —

(8)

తిమ్మ : (నవ్వుచు) తిట్టుదువా? మంచిది. అంతకన్న నేమి చేయుదువు?

భట్టు : —— —— —— తీవ్ర మహోగ్ర భయంకరంబుగా
దిట్టితినా మహోగ్రహమతిన్ మకరగ్రహ జర్జరీభటా
పట్టపు దట్టఫాలఫణి భర్గ్య బహూకృత పర్జట స్ఫుటా
ఘట్టన దట్టణాలక విఘట్ట నిరర్గళ రాజభృత్యకీ
చట్టచటార్భటీ నయన జర్జర కీలలు రాలఁగా వలెన్,

ధూర్జ : భట్టుమూర్తీ! ఆగుము. ఏమది?

భట్టు : చట్టుటీకంబునం బొగడ జూచితినా రజతాద్రి ధిత్యకా
పట్టణ మధ్యరంగ గత భవ్యవధూ వదనానుషంగ సం
ఘట్టశిరస్థ్సగాంగఝర వాల్లుకజాల సుధాతరంగముల్
చుట్టుకొనన్ వలెన్ భువన చోద్యముగా;—— —— ——

రామ : (తిమ్మనతో) అయ్యా! ఇంత ఎందులకు? మీకు తోచకదేదో యీయరాదా!

తిమ్మ : మీరు చెప్పనదేమి? ఇతని తిట్టు కవిత్వమునకే భయపడి అడిగినదంతయు నిమ్మందురా?

భట్టు : —— —— —— —— భయదంబుగా మఱిన్
దిట్టితినా! సభాభవన ధీంకృత భీమ నృసింహరాడ్ధ్వజా
తాట్ట సుహాట్టహాస చతురాస్య సముద్భ్రుకుటీ తటీనటీ
కోట్టణ రోషజాలహృత కుంఠిత కంఠ గభీరనాద సం
ఘట్ట విజృంభమాణగతిగా వలె; దీవనపద్య మిచ్చి చే
పట్టితినా! మణీకనక భాజనభూషణ భాసురాంబరా

రట్ట తురంగ గంధగజ రాజదమూల్య ఘనాతపత్ర భూ। పట్టణ భర్మహర్మ్య భటపంక్తి చిరాయు రనామయంబునై। గట్టిగ తోడుతో వెలయఁగా వలె; —

మల్ల : ఆర్యా! పెద్దలు. మీరును ఇంత పట్టు పట్టుట బాగుండ లేదు.

తిమ్మ : తిట్లతో దీవనలతో తెగునా తెల్లవాఱునా? ఇట్టి వారిని చాలమందిని చూచితిమిలే.

భట్టు : — — — — — నెక్కువ తీవిఁ జూడుఁడీ యట్టిటు మందె మేలముల నందఱునుం బలెఁ జుల్కఁ జూచియే! పట్టున నైనఁ గేరడము వల్కకుఁడీ —

తిమ్మ : ఏమి నీ యాధిక్యము? తిట్టుటలో నిన్ను మించినవారు చాలమంది కలరు. నే ననుకొన్నచో పదిమంది కవులను నీ పైకి పంపఁగలను.

భట్టు : — — — — — పయి పెచ్చునందులన్ గొట్టుదు దుష్కవిద్విరదకోటులఁ బంచె ముఖోద్భటాకృతిన్;। బెట్టుదు దండముల్ సుకవిబృందము కే నతిభక్తి సారెకున్;। గట్టితి ముల్లె ఁేఁబదియుఁ గాఁగల నూటపదారు లెమ్మెడన్;। రట్టడిభట్టు మూర్తి కవిరాయునిమార్గ మెఱుంగఁ జెప్పితిన్.

(చాటు - మణిమంజరి. 1 భాగము 104 పుట)

తిమ్మ : (పరిహాసముగా) చెప్పినావు గదా! ఇంక శాంతింపుము. చాల శ్రమ పడితివి. దాహమువకు మంచి నీరు తెప్పింతునా?

ధూర్జ : (కోపముతో) తిమ్మరుసుగారూ! మీరు పెద్దలు. మీకొకరు చెప్పవలసినదిగాదు. మీరొక కవినిట్లవ మానించుట శ్రేయస్కరముగాదు.

తిమ్మ : (కొంచెము కోపముతో) పెట్టినచో పెండ్లికూడు పెట్ట కున్నచో పిండములకూడు ఇదికదా మీ కవుల వరుస? ఎవరికి తెలియదు? ఏదో సంతోషసమయములలో పరితోషము కలుగునట్లుగా పదిమందిలో దీవించి నచో.........

భట్టు : (పండ్లు కొరుకుచు) తమరినా దీవింపవలె? మా వరుసను మీరు చెప్పితిరి. మీ వరుసమాత్రము మాకు తెలియదా?

శా॥ గుత్తిం బుల్లెలు కుట్టి, చంద్రగిరిలోఁ గూడెత్తి,
పెన్గొండలో। హత్తిన్ సత్రమునందు వేఁడి, బలు
దుర్గాధీసు తాంబూలవుం దిత్తుల్ మోసి ష దస్థు
లైనఘనుఁ న్ దీవింప — — — —

(పెద్దనాదులు ప్రవేశింతురు.)

తిమ్మ : (నవ్వుటకు ప్రయత్నించుచు) భట్టుమూర్తీ! మొత్తముమీఁద అసాధ్యుఁడవే! నీ శక్తిని గమ నింతమని వినోదమున కట్లంటిని. నే నేమి ఈయ లేని వాఁడనా? నీవు పుచ్చుకొనఁగూడని వాఁడవా? ఆ యగ్రహారమేమి! ఇదిగో వచ్చులహారము! ఇది పది యగ్రహారముల పెట్టు.

(హారమును తీసి మెడలో వేయును.)

భట్టు : (సంతోషించుచు) — — — — దీవించెదన్
మత్తారాతి యయాతి నాగమసుతున్
మంత్రీశ్వరున్ తిమ్మరున్ ।
(చాటు-మణిమంజరి. 1 భాగము. 104 పుట)

క ॥ అయ్యా యనిపించుకొంటివి
నెయ్యంబునఁ గృష్ణరాయ నృప పుంగవుచే
నయ్యా ! నీ సరి యేరీ ?
తియ్యని విలుకాఁడవయ్య! తిమ్మరుసయ్యా !

(పెద్దన, తిమ్మన, రామకృష్ణుఁడు, సూరన, ఎల్లన్న, తిమ్మరుసునకు నమస్కరింతురు. ధూర్జటి ప్రభృతులు పెద్దనకు నమస్కరింతురు.)

పెద్దన : ఏమో సంరంభముగ నున్నదే!

రామ : తిమ్మరుసుగారి వలన భట్టుమూర్తి పారితోషికము బడసినాఁడు.

రా॥కృ : ఔను వారు అతనికి అగ్రహారమునొసంగుటకు...

తిమ్మ : (పెద్దనతో) నే నిప్పుడు కార్యాలోచన మందిరమునకు పోవలసియున్నది. అచ్చట నొక ముఖ్యమైన పని కలదు. రాయలవారితో మనవి చేయుఁడు.

పెద్దన : చిత్తమట్లే! మీరు పోయిరండు.

(తిమ్మరుసు వెడలిపోవును.)

(ధూర్జటి ప్రభృతులు నవ్వుకొనుచుందురు.)

పెద్దన : ధూర్జటి మొదలగు వారితో) వీరే ఎల్లన్నగారు. రాధామాధవ కావ్యకర్తలు. (ఎల్లన్నతో) వీరే ధూర్జటిగారు.

ఎల్లన్న: మహాకవీ ! నమస్కారములు. తమ దర్శనముచేసికోవలయునని చాలకాలము నుండి కలదు. ఇప్పటికి కుదిరినది.

ధూర్జ : మేమును మీతో గోష్ఠికై యువ్విళ్లూరుచున్నాము.

పెద్దన : వీరు రామభద్రయ్యగారు, వీరు మల్లన్నగారు, ఇతఁడు భట్టుమూర్తి.

ఎల్లన్న: నేఁడు చాల సుదినము. మీ యందఱితో గోష్ఠి చేయు భాగ్యము కలిగినది.

(రాయలవారి రాకను సూచించు సవ్వడి)

తిమ్మప్ప+దౌవారికుఁడు : రాజాధిరాజ ! వీర ప్రతాప ! రాజపరమేశ్వర ! మూరురాయర గండ ! కృష్ణరాయక్షితీంద్ర ! బహుపరాక్ ! బహుపరాక్ !

(రాయలు ప్రవేశించి సింహాసనమువైపు పోవును. అందఱు లేచి నిలిచియుండి, ఆయన కూర్చుండిన పిదపఁ గూర్చుందురు.)

పెద్దన : మంత్రిగారు పనిమీఁద వెళ్ళినారు తమకు మనవి చేయుచున్నారు.

(ఎల్లన్నగారిని చూపుచు) వీరే ఎల్లన్నగారు.

ఎల్లన్న: (లేచి,

మ॥ బలభిన్నాగము చెంపఁ గొట్టి గిరిజా
పాణేశునత్త్రాని, వా
గ్జలజాతేక్షణకొప్పు వట్టి, శశివ
క్షుం బెక్కఁదట్టించి, యా
బలరాముస్ మొలఁ బట్టి, నీ యశము భూ
భాగమ్మునన్ మించె, నా
లలనామన్మథ ! కృష్ణరాయ నరపా
లా ! రాజకంఠీరవా !

(చాటుపద్యమణిమంజరి 1 భాగము 150 పుట)

రాయలు : (లేచి) మహాకవీ ! నమస్కారము.

ఎల్లన్న : గీ॥ పద్మనాట్య స్థలంబునఁ బక్కలోనఁ
బైరుపైఁ బవ్వళించిన పరమమూర్తి,
యనుదినంబును కృష్ణరాయాధిపునకుఁ
జుక్క జగడాల వేలుపు శుభము లొసఁగు.

(చాటుపద్యమణిమంజరి 1 భాగము, 159 పుట)

(కూర్చుండును.)

రాయలు : ఆర్యా ! మీ రాధామాధవ కావ్యము తోడనే మేమీ నవరాత్రులలో గోష్ఠి చేయుచున్నాము. మీ కవిత్వము కడు మధురము.

ఎల్లన్న : ధన్యుఁడను. తమవంటి మహాకవులు, పండితులు అభినందించుటకన్న మా కావ్యములకు చరితార్థత ఏమున్నది ?

భట్టు. : ఆ కాలమున నిజముగా రాధా మాధవు లెట్లు న్నారో ఎవరికిని తెలియదు. కాని ఎల్లన్నగారి పద్యములలో వారు ఆంధ్రులకు నిరంతరము ప్రత్యక్షమగుచున్నారు.

రామభ : భాగవత మహాగ్రంథమునకు పోతన్నగారివలె రాధామాధవ చరిత్రమునకు ఎల్లన్నగారు కవులుగా నేర్పడుట ఆంధ్రుల యదృష్టమే !

తిమ్మన : రాధా మాధవుల నాంధ్రమున నవతరింపఁజేసిన పుణ్యమూర్తులు గదా వారు !

కృ॥రా : ఔను. వారు రాధా మాధవ కవులే. (ప్రక్కకుఁ జూచి) ఎవరక్కడ ? భూషణములు తెమ్ము.

రా॥కృ : (విస్మయ సంతోషములతో) ఓహో ! బిరుద మెంత చక్కఁగా కుదిరినది !

పెద్దన మొదలుగా నందఱు : నిజము ! నిజము ! (సంతోషముతో కరతాళ ధ్వనులు చేయుదురు )

కృష్ణ॥ రా॥ : (సంతోషముతో) నేను ప్రస్తావనవశమున అట్లంటిని.

రా॥కృ : ఔను. అప్రయత్నముగా ప్రశంసలో ఆవిర్భవించు నమృతాక్షరావళియే కదా నిజమగు బిరుదము !

మల్ల : అట్లుకాక ఆలోచించి, ఆలోచించి యిచ్చినచో ఆ బిరుదము మన ప్రాంగణము దాటి వెలుపలి కెట్లు పోవును ?

రా॥భ : ఎట్లయిననేమి ! ఎల్లన్నగారికి 'రాధామాధవ కవి' అనునది మామూలు పేరువలెనే అతికిపోయినది.

భట్టు : ఔను. తిక్కన్నగారిని 'కవిబ్రహ్మ' యన్నట్లు. (భటుడు పళ్ళెరమున వివిధ భూషణములను తీసికొనివచ్చును)

కృ॥రా : నిజము. (ఎల్లన్న వంక నబహుమానముగా చూచి) మహాకవీ ! ఈ పారితోషకమును పరిగ్రహింపుడు. (హారములను తీసి మెడలోవేసి పళ్ళెరము నొసగును)

ఎల్ల : మహాప్రసాదము. (వినయముతో స్వీకరించును)

కృ॥రా : ఈ దినమున రాధామాధవ కావ్యఘట్టముల తోడనే గోష్ఠి చేయవలయు ననుకొంటిని. కాని రాజకార్యములచే నేనే ఆలస్యముగ వచ్చితిని. ప్రొద్దెక్కువగా నున్నట్లు లేదు.

మల్ల : దానికేమి ; రేపు కొనసాగింతము.

ఎల్ల : పెద్దలు క్షమించవలె. అమ్మాయికి వివాహముహూర్తము ఇంక నాలుగు దినములే యున్నది. నేను రేపు మరల ప్రయాణముచేసిననేగాని ఇంటికిచేరి ఏర్పాట్లు చేసికొనుటకు వీలుండదు. (రాయలతో) ప్రభువులు మన్నించవలె. ఎట్లయినను ప్రభువుల దర్శించి పోవలయునను పట్టుదలతో వచ్చితిని.

కృ॥ రా : సంతోషము కన్యాదానముకన్న కావలసిన దేమున్నది ?

సూర : ఇంత తొందరలో కూడ మీరెట్లో అవకాశమును గలిగించుకొని వచ్చుటే గొప్ప విశేషము.

తిమ్మన : కావ్యఘట్టముల కవకాశము లేకున్న నేమి ? సమస్యలతోడనో, ఆశువు తోడనో కొంచెము సేపు వినోదింతము.

కృ॥రా : మంచిదే ! (పెద్దన్నగారితో) మీరేదైన నుపక్రమింపుడు.

పెద్దన : పెద్దలు ధూర్జటిగారు ప్రారంభించినచో బాగుండును.

ధూర్జటి : సరే ! 'నగరు, తగరు, తొగరు, వగరు' అను పదములను ప్రాసస్థానములలో నుంచి రామాయణ పరముగా పద్యము చెప్పెదరా ?

(ఎల్లన్న వంకఁ జూచును)

ఎల్లన్న : దానికేమి ? అట్లే చేయుదును. నా కాశువునందభ్యాసము తక్కువ. పెద్దలు మన్నింతురుగాక.

చం॥ నగరు పగాయె, నిరకవిపినమ్ముల కేగుఁడు, రాజ్యకాంక్షకుం। దగరు, కుమారులార ! యని తల్లి వగల్మిగులంగఁ దోఁచఁగాఁ । దొగరు నరక్షఁగట్టి పదిఁదోఁపక గద్గద భిన్నకంఠియై

వగరుచుచున్నఁ జూచి రఘువంశవరేణ్యుఁడు
తల్లి కిట్లనున్.

(చాటు - మణిమంజరి. 1 భాగము. 153 పుట)

భట్టు : కౌసల్యాదేవి కాలమున కూడ రక్షరేకులు కలవా!

సూర : లేవని ఏమైన ప్రమాణము కలదా!

కృ॥రా : ఈ కాకదంత పరీక్ష ఎందులకు? భారతార్థమునఁ గూడఁ జెప్పిన బాగుండునే! (ధూర్జటి వంకఁ జూచును)

ఎల్ల : నేనే పూరింతును.

చం॥ తొగరుచి కన్నుదోయిఁ గడుఁ దోఁపఁగఁ
గర్ణుఁడు భీమసేనుపైఁ। దగరు ధరాధరంబునను
దాఁకిన భంగినిదాకి నొచ్చి తా। వగరుచుచున్
వెసన్ బరుగు వాఱిన, నచ్చటి రాజలోకముల్।
నగరు సుయోధనాజ్ఞ మది నాటుటఁ జేసి
ధరాతలేశ్వరా!

(చాటు - మణిమంజరి 1 వ భాగము. 154 పుట)

ధూర్జ : ఇది ఇంకను బాగున్నది. ఆశువునందుఁ గూడ నెల్లన్న గారు అనర్గళమైన ధారగలవారే!

తిమ్మన : ఇంక భాగవతార్థమేకదా మిగిలినది!

ఎల్ల : ఆ కొదువ ఎందులకు? వినుఁడు.

చం॥ వగరువు మాత్రమే వరుఁడు వశ్యుఁడు గాఁడు; సఖీసఖిత్వ మె । న్న గరుడవాహనుఁడు మము నాఁ డటు డించుటయెల్ల నద్దవా! । తగరని కాక, మోహపు లతాతనులైన విడంగుఁ జూతురే । తొగ రుచి యోషధీశునకుఁ దోఁపఁగ జేయునె పీడనాడ గన్

(చాటు మణిమంజరి 1 భాగము 155 పుట)

కృ॥రా : బాగున్నది.

(తెరలో)

మొదటి వంది : కం॥ శ్రీ సదనలోచనాబ్జ! ద
యాసార మరంద పోషితార్థి భ్రమరో
ల్లాస। గుణ! మలయకూట
ప్రాసాదనివేశ! కృష్ణరాయ మహీశా!
(పారిజాతాపహరణము, 2 ఆశ్వా. 1 పద్యము)

రెండవ వంది :

శా॥ శ్రీ౦ఖల్ గట్టి నభోంతరాళమునఁ బాటెం బక్షులుత్క్రాంశు పా । షాణవ్రాతము కోష్ణ మయ్యె; మృగతృష్ణావార్థు లింకెన్ జపా । శోణం బయ్యెఁ బతంగ బింబము; దిశాస్తోమంబు శోభాదరి । ద్రాణంబయ్యె సరోజషండములు నిద్రాణంబులయ్యెం గడున్.

(మనుచరిత్ర. 3 ఆశ్వా. 12 పద్యము)

కృ॥రా : (ఎల్లనార్యుని వంకఁజూచి) మీకు పుత్రిక లెందఱు?

ఎల్ల : ఒక్కతెయే కూఁతురు ప్రభూ! ఆ కారణముననే కొంచెము మంచి సంబంధము చూడవలయునని చాల కాలముగ వెదకుచునే యుంటిని.

పెద్ద : ఇప్పుడు నిశ్చయింపఁబడిన వరుఁడెవఁడు........

ఎల్ల : మాయూరి కరణముగారి కుమారుఁడు.

ధూర్జటి : విద్యాశాలియేనా?

ఎల్ల : ఫరవాలేదు. పాండిత్యము లేకున్నను సామాన్యముగా సంస్కృతాంధ్రముల నభ్యసించినాఁడు. అరబ్బీ పారసీ మొదలగు భాషలు నేర్చి కరణీకపు లెక్కలలో ఆరితేఱి యున్నాఁడఁట.

పెద్ద : (రాయల వంకఁ జూచి) ప్రభువు లనుగ్రహించినచో వాని కెక్కడనైన మంచి యుద్యోగము లభింపఁ గలదు.

కృ॥ : ఎవరురా అక్కడ?

దౌవారికుఁడు : (ప్రవేశించి) చిత్తము ప్రభూ! ఏమాజ్ఞ?

కృ॥రా : పూజా ద్రవ్యములు, వేయి వరాలును దెమ్ము. (ఎల్లన్నవైపు చూచి) మీరు రేపు బయలుదేరు నపుడు అప్పాజీగారిని దర్శించి నేను చెప్పితినని వారి యొద్దనుండి మీదుర్గాధీశునకు లేఖ దీసికొనిపొండు. అచ్చట మీ యల్లునకు మంచి యుద్యోగమే లభింపఁ గలదు.

ఎల్ల : మహాప్రసాదము.

మల్లన : ఎల్లనగారు సర్వధా కృతార్థులైనారు.

ఎల్ల : (సంతోషముతో) సందేహమేమున్నది ? (రాయలను పెద్దనాదులను చూపుచు)

శా॥ రాధామాధవ మచ్యుతాంకితముగా ప్రౌఢక్రియం
జెప్పి తన్మాధుర్యంబునఁగృష్ణరాయవిభుఁ గర్ణాటేశు
మెప్పించి నా । నా ధాతృప్రతిమాన సత్కవుల
లోనన్ భూషణశ్రేణితో । రాధామాధవనామ
మందిన జగత్ప్రఖ్యాతచారిత్రుఁడన్.
(రాధామాధవము - 1 ఆశ్వాస - ప. 30)

ఇంతకన్న చరితార్థతకలదా ?

('నిజము, నిజము' అని ఎల్లరును హర్షధ్వానములు చేయుదురు)

(దౌవారికుఁడు పూజాద్రవ్యములు పళ్ళెరములోఁ దెచ్చి వస్తువులు రాయుల కందించుచుండును.)

కృ॥రా: (లేచివచ్చి ఎల్లన్నకు వస్త్రములిచ్చి తాంబూలము, వరాలసంచి నొసంగి) ఇది మీరు చేయు కన్యాదాన మహోత్సవమునకు వినియోగింపుఁడు.

(పాద ప్రణామము చేసి వచ్చి సింహాసనముపై కూర్చుండును.)

ఎల్ల : (సంతోషముతో) సర్వసన్మంగళాని భవంతు.

ఉ॥ అబ్జముఖీమనోజ ! నరసాధిపనందన ! కృష్ణ !
నీయశం । బబ్జకరాబ్జజాబ్జనయనాబ్జ విలాసము,
నీ వితీర్ణిమం । బబ్జకరాబ్జ జాబ్జ నయనాబ్జ విలా
సము, నీ పరాక్రమం।బబ్జ కరాబ్జ జాబ్జనయనాబ్జి
విలాసము చిత్రి మిద్ధరన్.

(చాటు - మ - మంజరి 1 భా 159 పుట)

(కృష్ణరాయలు లేచి తక్కిన కవులకు వస్త్రములను తాంబూలముల నొసంగును)

కృ॥ రా : నేఁటికి సభ చాలింతము (వెడలిపోవును. అందఱు నిష్క్రమింతురు. తెరవ్రాలును.)

# విష్కంభము

(విజయనగరమున నొకవీధి. ఎవరికోసమో వెదకుచున్నట్లుగా బొడ్డుచెర్ల చినతిమ్మన ప్రవేశించును.)

చినతిమ్మన : వీని దుంపతెగ ! ప్రతిదినము వచ్చి కొంప దగ్గఱ పడిగాపులు కాయుచుండువాఁడు. ఈ దినము ఏమివచ్చినదో ప్రొద్దుటినుండి చూతునుగదా ! ఎక్కడఁజూచినను కనుపడఁడే?

(తిమ్మప్ప ప్రవేశించును) తిమ్మప్పా ! ఎక్కడకో బహువేగముగ పోవుచున్నావే ఏమికథ ?

తిమ్మప్ప : కొప్పోలుకరణముగారా!దండాలండీ! బాబయ్యా! కవుల గోష్ఠికి వేళయగుచున్నది. రాయలవారు

బయలుదేరుచున్నారు నేను త్వరగా పోవలసి యున్నది.

చి. తి : అది సరేకాని, నరసయ్య ఎక్కడున్నాడు ?

తిమ్మ : ఎవరు ? మా నరసింహకవిగారా ? ఇంకను ఆయన నెందుల కేడిపించెదరు ? ఆయన త్రోవ ఆయన చూచుకొనుచున్నాడు.

చి॥ తి : అంతమాట ఎందులకు? నేను స్వయముగా ఆతనిని రాయలవారి యొద్దకు తీసికొని పోయెదనని చెప్పితిని గదా !

తిమ్మ : ఎప్పటికి? నేనును ఆయనయును బ్రదికి యుండగా నది జరుగునా ?

చి॥ తి : నేనేమి చేతకానివాడనా ? లేక మాట తప్పెడి వాడనా ?

తిమ్మ : అదేమో నాకు తెలియదు. నేను ఆయనను దెచ్చి మీకు పరిచయము చేసి నెలరోజులు దాటినది. అప్పటినుండి మీరు రేపని ఎల్లుండియని దాటవేయు చునే యున్నారు.

చి॥ తి : ప్రభువులతో కూడిన వ్యవహారములు నీకు తెలియునివా ? నే నింతకాలము ఆతనిని గూర్చి రాయల వారితో ప్రస్తావింపలేదనియే అనుకొనుచున్నావా ? అసలింత ఎందుకు? ఇప్పుడు పిలుచుకొని రమ్ము, నేటి సభలో నే అతనిని ప్రవేశపెట్టుదును గదా !

తిమ్మ : ఏమో నేఁడు విశేషము! తమ కేమైన చేతికి కాంచెము తడి తగులునట్లున్నదా?

చి॥ తి : నేనేమి లంచగొండినా? అట్లు మాటాడెదవేమి? పోనీ లేయని పరోపకారమునకు పూనుకొను చున్నందులకా యీ మాటలు?

తిమ్మ : అయినను తమకెందుకీ శ్రమ? వారికాళ్ళు, వీరికాళ్ళు పట్టుకొని ప్రాధేయపడుటకన్న నేరుగా సభలోనే ఆయన ప్రవేశింపఁ దలఁచుకొన్నాఁడు.

చి॥ తి : మంచిపనియే. అది మొదటనే అఘోరింపకపోయి నాఁడా? నే నిప్పుడింత చేసిన తరువాత తాను స్వయముగా సభలో ప్రవేశించినచో నా పరువు మర్యాద లేమగును?

తిమ్మ : అయ్యో! ఇవి యన్నియు నాకేమి తెలియును? నాకు వేళయగుచున్నది. నన్ను పోనిండు.

చి॥ తి : (బ్రతిమిలాడుచు) తిమ్మప్పా! నా మాట వినుము. ఎట్లయినను ఆతని నీ దినము రాయలవారి యొద్దకుఁ దీసికొని పోకపోయినచో మన పరువు దక్కదు.

తిమ్మ : మీకెందుకీ తాపత్రయము? ప్రభువు లాజ్ఞాపించినారా?

చి॥ తి : కావుననే కదా వానికై వెదకుచున్నాను. లేకున్న నాకేమిపని?

తిమ్మ : (నవ్వుచు) అలాగా! ఆయనయును నా వెనుక ఇటే వచ్చుచున్నాఁడు. (దూరమును చూపి) మఱి నాకు సెలవు

(నిష్క్రమించును.)

చి॥ తి : అమ్మయ్య! బ్రతికితిని.............
(సంకుసాల నృసింహకవి ప్రవేశించును) ఏమయ్యా! ప్రొద్దుటినుండి ఎక్కడికి పోయితివి? రాను రాను పచ్చ కర్పూరమై పోవుచున్నావే!

నృసిం : ఔను. ఈ యూరిలో ఇంక నాల్గురోజులున్నచో కర్పూరమువలె హరించిపోక యేమున్నది? అసలు మీా చుట్టు తిరిగి తిరిగి నా కళ్ళు అరిగిపోవుచున్నవి.

చి॥ తి: కార్యార్థులట్లు చికాకుపడినచో నెట్లు? ఇదేమి సామాన్యమా! రాజాశ్రియము కదా!

నృసిం : ఏమి రాజాశ్రియమో "రాజసేవా మనుష్యాణా మసిధారావలేహనమ్" అని ఎవఁడు చెప్పెనోకాని చక్కఁగా చెప్పినాఁడు.

చి॥ తి : ఈ మాటలకేమిగాని చాల గడపలు మెట్టినట్లు న్నావే? ఎవరెవరిని చూచితివి?

నృసిం : చూడఁదగని వారి నందఱను చూచితిని.

చి॥ తి : ఏమి! చూడఁదగనివారిని చూచితివా?

నృసిం : కాకున్న ఈ యూరిలో చూడఁదగిన వారెవ రున్నారు?

చి॥ తి : (నవ్వుచు) ఇంత నగరమున నీకు చూడఁదగినవారే లేరా? పెద్దన్నగారిని చూచితివా ?

నృసిం : విసుగుతో) ఏమి పెద్దన్నయో మొద్దన్న! ఆయన కంటికి కన్పించినఁగదా! తిమ్మన్నను చూచితిని. చాలు !

చి॥ తి : (నవ్వుచు) నరసింహుఁడవుగదా నీవు! వారితో నిప్పుడే వర్ణయకలహ మారంభించితివా! నఖ క్షతములు, దంతక్షతములు సంభవించినవా?

నృసిం : (కోపముతో) మీ కందఱకును కవుల వివాద మన్నచో పరిహాసమే కాని పరమార్థము విచారింత మను పట్టుదల యుండదు. సరే! మా పాట్లు మావి.

చి॥ తి : సరేలేవయ్యా! జరిగినదేమో చెప్పుము.

నృసిం : నిన్న ఉదయము తిమ్మన్నగారి యింటికి పోతిని. అప్పటికే సూరన్నయు, భట్టుమూర్తియు చేరి ఏదో కవిత్వ ప్రసంగమే చేయుచున్నారు.

చి॥ తి : మంచి సమయమునకే పోయితివి.

నృసిం : పరిచయ వాక్యములైన తరువాత నా కావ్యము లలో నొక ఘట్టమును చదివి వినిపించితిని.

చి॥ తి : మెచ్చినారా ?

నృసిం : మెచ్చకేమి చేయుదురు? అంతమాత్రపుఁ బద్యము లను వారెప్పుడైన వ్రాసి యుండిరఁగదా! భట్టు

మూర్తి "పద్యములకేమి? బంగారమువలెనున్నవి" అని మెచ్చుకొనెను. ఇంక తప్పని సరిగా సూరన్న, తిమ్మన్నయు 'నిజము, నిజము' అనిరి.

చి॥ తి : నీవంతటఁ బోనిత్తువా ?

నృసిం : ఔను! ఎందుకు పోనీయవలె? 'ఇది మనుచరిత్రను మించునందురా ?' అని నేరుగనే యడిగితిని.

చి॥ తి : (అదరిపడి) మంచిపనియే చేసితివి. తరువాత-

నృసిం : అదియేమి కర్మమో తెలియదు. ముగ్గురును పిడుగు పడినట్లు నిశ్చేష్టులై కొంతసేపటికి ఒకరి మొగము నొకరు చూచుకొనఁ జొచ్చిరి.

చి॥ తి : తరువాత -

నృసిం : మీకు తోఁచిన విషయమును నిష్పాక్షికముగా చెప్పఁడు. ఇంత సందేహ మెందులకు?' అని మరల నడిగితిని. తిమ్మన్నగారు తేరుకొని 'ఒకరి రచనముతో మీకు పోలిక ఎందులకు? మీ పద్యములు బాగున్నవని చెప్పితిమి కదా!" అని అసలు విషయము పులిమి పుచ్చుటకు పూనుకొనెను.

చి॥ తి : నీవు అంతటనైనను వదలలేను.

నృసిం : ఆదేమి అట్లందురు? నేనేల వదలవలయును? ఎక్కువ తక్కువలు తేల్చుకొనుట తప్పా!

చి॥ తి : తప్పులేదు! ఒప్పులేదు! జరిగిన సంగతి చెప్పుము.

నృసిం : ఏమున్నది ? ఆ సూరన్న తాతగారిమీఁది యభిమానముచొవ్వున 'ఇక్కడి కవులందఱును పెద్దన్నగారిని కవిత్వమునకూడ పెద్దన్నగారిగానే గౌరవించుచున్నారు. ఎవ్వరును వారి కవిత్వముతో తమ రచనలను పోల్చుకొనుటకు సాహసింపరు' అని పలికెను.

చి॥ తి : ఔను ! అంతే.

నృసిం : తిమ్మన్నయును 'ఆమాట నిజమే' యనెను. 'అయ్యా! మీకాయన సన్నిహితుఁడు కావున మీకట్టి సాహసము లేకపోవచ్చును. కాని నాకేమి! తిమ్మన్నగారి యనుగ్రహమున్నచో రేపే సభయందు ప్రవేశించి రాయలవారి సమక్షముననే ఎవరికావ్యమెక్కువో తేల్చివేయనా ?' అని పలికితిని.

చి॥ తి : ఇదేమి మీ యూరిలో పిల్ల కుంకలతో కుస్తీపట్లు పట్టినట్లనుకొన్నావా ?

నృసిం : కాకేమి ! (మల్లచఱచి) మల్లయుద్ధమేమి ? కావ్యవాదమేమి ? దేనికైనను సిద్ధమే.

చి॥ తి : (నవ్వుచు) నీవు రాయలవారితోనే తలపడునట్లున్నావే ! సరే ! తరువాత !

నృసిం : ఏమున్నది ! ముగ్గురి ముఖములును కందగడ్డలవలె నెఱ్ఱఁబడినవి. తిమన్నగారు లేచి 'మీకు సభాప్రవేశము కలిగించుట మావల్లఁగాదు; పెద్దన్నగారే చేయవలయును. వారి మాటపైననే రాయలవారికి గౌరవ

మెక్కువ. ఎట్లయినను మీరు వారినే చూడుఁడు' అని చెప్పుచునే లోనికి పోయెను.

చి॥ తి : నీకు మఱుమాట కవకాశమీయులేదన్న మాట.

నృసిం : ఔను! అప్పటికే ఆయన ప్రాణము లన్నువట్టినవి. ఇంక కొంచెము జరిగినచో తన పారిజాతాపహరణ మునకేమి ముప్పు వచ్చునోయని హడలిపోయి యుండును.

చి॥ తి : భట్టుమూర్తియు, సూరన్నయు నేమనిరి?

నృసిం : వారును నాతోనే బయలుదేరి వచ్చిరి. సూరన్న కసలు నోట మాటయే రాలేదు. సూరన్న విడిపో యిన తరువాత భట్టుమూర్తి నావంక ఆప్యాయ ముగఁచూచి 'అప్పుడే యీ తారతమ్య పరీక్ష లెందుకు? ఎట్లయినను ముందుగా మీరు పెద్దన్న గారిని ప్రసన్నునిగా చేసుకొని సభాప్రవేశము గావింపుఁడు. పిదప తక్కిన సంగతులు చూచుకొన వచ్చును. అని చెప్పి వెడలిపోయెను.

చి॥తి : మంచిమాటయే చెప్పినాఁడు. తరువాత?

నృసిం : ఈనాఁ డుదయము పెద్దన్నగారి యింటికి పోయితిని' 'వారు అనుష్ఠానములో నున్నారు. కూర్చుండుఁ' డని చెప్పిరి. 'సరే' యని కూర్చుంటిని. బారెడు ప్రొద్దెక్కినను ఆయన దర్శనమీయలేదు. మధ్యా హ్నము చూడవచ్చునా లేయని మరలివచ్చి యింతకు

ముందే మరల పోయితిని. 'ఇప్పుడే భోజనముచేసి విశ్రమించి యున్నారు; ఇప్పుడెవరినీ చూడరు' అని కబురు పంపినాఁడు. ఇంక యిది కానిపనియని అక్కడ నుండి తిరిగి వచ్చుచున్నాను.

చి॥చి : (సాలోచనముగా) బాగుగానే యున్నది. నీవిట్లు ప్రసంగించుచున్నచో నెట్లు?

నృసిం : నా తప్పేమున్నది? సూరన్న పోయి నామీఁద కొండెములు చెప్పియుండును. ఆ మాటలు విని నా యెదుటఁబడినచో తన బండారము నెక్కడ తత్క్షణమే బయట పెట్టుదునో యని వణఁకుపుట్టి ముసుఁగు పెట్టుకొని యా పెద్దన్న మూలను ముణిఁగి యుండును. అదియును నాతప్పేనా?

చి॥ తి : అయినచో వీరందఱును గాజులు తొడిగించుకొని యున్నారనియేనా నీ యభిప్రాయము?

నృసిం : ఆఁ! అంతే కాకున్న మఱేమున్నది? మగతనమే యున్నచో బరిమీద నిలిచి మాట్లాడు మనుము. ఎవరిశక్తి యెట్టిదో మూఁడు నిమేషములలో తేలఁ గలదు. అసలు వీరిలో సంస్కృతమున సాహిత్యము కుదిరిన వాఁడెవఁడయ్యా! నిలువఁబెట్టి యడిగినచో నైషధములో ఒక్క శ్లోకమునకైన అన్వయించి యర్థము చెప్పఁగలవాఁడున్నాఁడా?

చి॥ తి: వారు నీ మాత్రము చదువలేదని నీ కెవరు చెప్పిరి?

నృసిం : ఒకరు చెప్పుట ఎందులకు? వాదమునకు దిగినచో వెంటనే తెలియదా? ఎందుకయ్యా ఈ మాటలు? పాండిత్య మెట్లున్నను ఆశ్రియుణ విద్యలో పదవుల నధిష్ఠించి యందలములెక్కి తిరుగుటే కాని వీరికి విద్యయం దభిని వేశమూ, ఆత్మగౌరవమూ; రెండును లేవు. ఉన్నదొక్కటే, ఓర్వలేనితనము.

చి॥ తి: ఎందుకట్లు ఊరక నోరుపారవేసుకొనెదవు? నీవు మాత్రి మిప్పుడీ పడుచున్న పాట్లన్నియు దేని కొఱకు? రాజాశ్రయమునకే కదా! నీవును అట్టి పదవినే రేపు పొందినచో, ఇతరులను జేరనిత్తువా?

నృసిం : నా విషయమట్లెప్పుడును కాదు. క్రొత్తవాఁడెవఁడైన వచ్చినచో నాకేమి భయము వాద యుద్ధమున కెప్పుడును సిద్ధమే.

చి॥ తి: సరే సిద్ధముగనే యుండుము. విద్యార్జన కోలాహలుఁడుకూడా వచ్చియున్నాఁడఁట.

నృసిం : (అదిరిపడి) పెద్దిగడరాజు నరసరాజా? (స్వరము తగ్గించి) ఈయన ఎక్కడ దాపురించెను?

చి॥ తి: (నవ్వుచు) భయపడుచున్నట్లున్నావే? ఎఱుఁగుదువా ఏమి?

నృసిం: (సర్దుకొని) భయమునకేమున్నది? అతఁడు కొంచెము నోటి దుడుకుగలవాఁడు. సాహిత్యమునన్నైనచో అతఁని లెక్క పెట్టవలసిన పనిలేదు. తర్కవ్యాకరణములలో మాత్రి ముద్దండుఁడు. మఱి......

చి॥ తి : ఏమి సభా ప్రవేశము సంగతియేనా !

నృసిం : ఔను. ఎందుకైనను మంచిది. నేఁడే రాజదర్శనము చేయింపుఁడు.

చి॥ తి : సరే అట్లే చేయుదము. ఇప్పటికే సభ యారంభమై యుండును. త్వరలో బయలుదేరవలెను.

నృసిం : ఇంక బయలుదేరుట కేమున్నది! ఇట్లే పోవుదము

చి॥ తి : మంచివాఁడవే ! ఈ వేషముతోనే వచ్చెదవా! మా యింటికి పోదమురా ! తగిన దుస్తులను, అలంకారముల నిప్పింతును. సభలోకూడ నేను చెప్పినట్లుగా వినీతుఁడవై వర్తించి నా పరువు నిలిపి, నీ పరువును కాపాడుకొనుము.

నృసిం : సరే (ఇద్దఱును నిష్క్రమింతురు,

---

# భువనవిజయము

## తృతీయాంకము

(కృష్ణదేవరాయలు సింహాసనస్థుఁడై యుండును. కుడివైపున పెద్దనాదులు, ఎడమవైపున ధూర్జటి ప్రభృతులును ఆసీనులై యుందురు. రెండు వైపులను రెండు కుర్చీలు ఖాళీగనుండును. రాయలు ఇంచుక వ్యగ్రుఁడై సభవంక చూచుచుండును. అందఱును ఆయనవైపు చూచు చుందురు)

కృ॥ రా: సంకుసాల నృసింహకవి యనువాఁడను మహాకవి మనయూర నున్నాఁడఁట, మీ రెవ్వరెఱుంగరా?

ధూర్జటి, మల్లన, రామభద్రుఁడు: మాకు తెలియదు ప్రభూ!

తిమ్మన: నిన్ననే మాకు వారితో సమాగమము సంభవించినది.

భట్టు: నేనును, సూరన్నయును తిమ్మన్నగారి యింటనే వారిని చూచితిమి.

కృ॥ రా: మఱి నిన్నటి సభలోకాని నేఁడుకాని మీ రెవరును ఆయనను గూర్చి ప్రస్తావింపనే లేదే?

తిమ్మ: వారి విషయ మింకను పరిశీలించుచున్నాము. ఒక అభిప్రాయ మేర్పడలేదు.

కృ॥ రా: (పరుషముగా) ఇంత దీర్ఘముగ పరిశీలించుటకు, సిద్ధముగా నిశ్చయించుటకును ఇదేమంత రాజనీతి

విషయమా ? పరదేశులైన పండితులు, కవులు వచ్చి మీ దర్శనమునకే వడిగావులు గాయవలసి వచ్చినచో వారెట్టి సంకటస్థితి నొందుదురో యూహించితిరా ? దానివలన మాకెంత యప్రతిష్ఠ కలుగునో యాలోచించితిరా !

పెద్దన : ప్రభువులు మన్నింపవలె. ఏ కవినిగాని, పండితుని గాని తమకు పరిచయము చేయుటతో మాకు కష్టము గాని నష్టముగాని కలుగునని మే మెప్పుడు తలంచుట లేదు. వారు మమ్ము మించినను తమ యాదరాభిమానములు మాయెడల తగ్గుననియు మే మనుకొనుటలేదు.

రా॥కృ : ప్రభూ ! పెద్దనగారుగాని, తిమ్మన్నగారుగాని, అట్టి సంకుచిత బుద్ధులైనచో నేఁడింతమంది కవులు ఇచ్చట నిలిచియుందురా ?

ధూర్జ : ఎల్లన్నగారిని పరిచయము చేసినది వారేకదా !

కృ॥రా : (కొంచెము తగ్గు స్వరమున) మఱి నృసింహకవి గారి విషయమున నింత సందేహమేల కలిగినది ?

తిమ్మ : ఆయన స్వభావమున చాల దుడుకుతనము కన్పించుచున్నది. అట్టివానిని మేమే వెంటఁబెట్టుకొనివచ్చి తమకు పరిచయము చేసినచో... ..

కృ॥ రా: నష్టమేమికలుగును? అతని స్వభావమట్టిదని మేమును గ్రహింతుము. అంతియేకాని మిమ్ముఁగూర్చి మేమేల యన్యథా తలంతుము?

ధూర్జ : అసలు ప్రభువుల కాయనను గూర్చి ఎట్లు తెలిసినది?

కృ॥ రా: నేఁటి యుదయమున చిన్నతిమ్మన్నగారితో చదరంగ మాడుచుండఁగా ఆయన సందర్భవశముగ నొక పద్యపాదమును చదివెను.

ధూర్జ : ఏమది ?

కృ॥ రా : 'ఉద్ధతుల మధ్యఁ బేదల కుండఁ దరమె?' అని. విన్నంతనే యది యద్భుతమైన అర్థాంతరన్యాసమై యుండునని తోఁచి పై పాదములను కూడ చదువుఁడని కోరితిని. ఆయన పై పాదములకు కూడ చదివెను.

> 'ఒత్తుకొని వచ్చు కటికుచోద్వృత్తిఁ జూచి
> తరుణి తనుమధ్య మెచటికో తలఁగి పోయె
> నుండె నేనియుఁ గనఁబడకున్నె! యహాహ!
> ఉద్ధతుల మధ్యఁ బేదలకుండఁదరమె ?'
> (కవికర్ణరసాయనము 3 ఆశ్వా. 26 పద్యము)

పెద్ద : చక్కఁగా చెప్పినాఁడు.

ధూర్జ : చాల సరసముగ నున్నది.

మార : ఒక్క పద్యము కొంచెము కుదిరినంత మాత్రమున కావ్యమంతయు నిట్లే యుండునని యెట్లు చెప్పఁగలము?

భట్టు : పాకము తెలియుటకు అన్నమంతయు పట్టి చూడవలయునా? ఒక్క మెతుకును చూచిన చాలదా ?

మల్ల : నిజము ! నిజము ! ఒక్క పద్యము వల్లనైనను కవి యొక్క అంతస్సారమును గ్రహింపవచ్చును.

కృ॥ రా: ఇది యంతయునేల ? ఆయన ఏ గ్రంథమును రచింపక ఈ యొక్క పద్యమునే రచించి యున్నను ప్రతిభాశాలి యనియే చెప్పవలయును.

రామభ : కవులందఱు శతకములచే ముక్తకములచే కూడ ప్రసిద్ధులై యుండలేదా ! దాని కేమి !

కృ॥రా : గుణముకదా ప్రధానము, పనికిమాలిన నగలు పట్టెడేల? రత్నములహార మొక్కటియైనఁ జాలదా ?

రామకృ : ప్రభువులు చక్కఁగా జెప్పినారు. మట్టి కుండల వలె వ్రేలాడుటకు (తన కుండలములు చూపుచు) రెండు కుండలములేల? ఒకటియున్నను రత్నకుండలమే యుండవలయును. (అని తిమ్మన్నవంక భట్టుమూర్తి వంకఁ జూచును. వారు తలపాగలు క్రిందికి సవరించుకొనుచు వట్టి చెవులను కప్పుకొనుటకు ప్రయత్నించు చుందురు.)

కృ॥ రా (మొదట తిమ్మన్నవైపు, పిమ్మట భట్టుమూర్తి వంకను జూచి నవ్వుచు) భట్టుమూర్తీ! నీకును ఒంటి కుండలమేనా ? ఇందేదో విశేషమున్నట్టున్నదే !

రా॥కృ : ప్రభూ ! ఈ కథయంతయు మన సూరన్నకుఁ దెలియును. సూరన్నా ! తత్కథాక్రమం బెట్టిదో యింకఁ జెప్పుము.

కృ॥ రా : చెప్పుము. సందేహ మెందులకు?

సూర : చిత్తము ప్రభూ! నిన్న యుదయము (భట్టుమూర్తిని జూపి) మే మిరువురమును తిమ్మన్నగారి యింటికిఁ బోయితిమి అచ్చట ప్రసంగవశమున నితఁడు రామరాయలవారిపై రచించిన యొక పద్యమును చదివి వినిపించెను.

కృ॥రా : ఏ పద్యమది?

సూర : దానిని భట్టుమూర్తి చదివినచే బాగుండును.

కృ॥ రా : (భట్టుమూర్తిని జూచి) చదువుము.

భట్టు : చిత్తము.

మ॥ హరిశౌర్యం డగు రామభూవిభుని తీవ్రాటోపవ
ద్యాహినీ। శరవేగంబున నాత్మమూల బలముల్
జారన్ దళాడంబరం। బరుగం గొమ్మలు వోవ
లావతి నిజామాదు ల్కజీకు ల్భజం। తురు నమ
త్వముఁ గానలో మునలి మానుల్గావితర్కించినన్.

(వసుచరిత్రము 1 అశ్వాసు. 45 పద్యము)

ధూర్జ : ముసలిమానులా? బాగున్నది.

రామభ : శ్లేష ఎంత సుకుమారముగా నమరి యున్నది?

మల్ల : ఇట్టి రచనము భట్టుమూర్తికే చెల్లును.

కృ॥ రా: సరే! తిమ్మన్నగారేమనిరి?

సూర : వారు దీనినాక్షేపించిరి. 'ఇదేమి వర్ణనమయ్యా! 'హరి శౌర్యం'దని మొదటి మాటలోనే ప్రధాన

విషయమను వాచ్య మొనర్చితివే! వాహిని కొంత కేర్పడిన శ్లేషాడంబరమే కాని పరాక్రమ మెక్కడ నున్నది? శత్రుశేషము నుంచితివి కదా! ఇంతకును సైన్యము సంగతిని చెప్పితివే కాని రామరాయల శౌర్య పరాక్రమముల నేమి చెప్పితివి.' అని వారు విమర్శించిరి.

రామకృ : విమర్శ యన్నచో నిట్లుకదా యుండవలె!

ధూర్జ : ఔను. వారు చెప్పినది యుక్తి సహముగనే యున్నది.

కృ॥రా: సరే! ఇంతకును ఇతఁడేమైన సమర్థించు కొనఁ జూనుకొనెనా?

సూర : భట్టుమూర్తి మిక్కిలి సరసుఁడు కదా! వారు చెప్పినదానిని అంగీకరించి 'మఱి ఎట్లు చెప్పిన బాగుండునో తమరు సెలవిండు' అని అడిగెను.

రామభ : ఇది మంచియెత్తే.

సూర : అంతట వారు తమపై చెప్పియుండిన పద్యమును చదివిరి.

కృ॥రా. ఏ పద్యమది? (తిమ్మన్నగారి వంకఁజూచును)

తిమ్మన :

శా॥ శ్రీరంగేశ్వర నాభిపంకజ రజశ్శ్రీకంబెఁ
జోళేంద్రి త స్త్రీరాజత్కుచపాళి కుంకుమము

కంఠెన్ సహ్యాభూభృత్తటీ। సీరంధ్రీకృత గైరిక
ద్రవము కంఠెన్ వన్నెఁ గావించెఁ గా। వేరీ
తోయము కృష్ణరాయఁడహితోర్వీనాథ రక్త
ప్రభన్.

(పారిజాతాపహరణము 1 అశ్వా. 18 పద్యము)

ధూర్జ ! ఓహో ! రాయలవారి పరాక్రమమును తిమ్మన్న గారు వ్యంగ్య మర్యాదతో కడురమణీయముగ వర్ణించిరి.

కృ॥ రా : తరువాత ?

సూర : ఇతడు చాల సంతోషించి ఆ పద్యములోని విశేషమును తానే కొండాడెను. సైన్య ప్రస్తావనము లేకుండుటచే రాయలవారి యసహాయ శూరత, పరాక్రమము ప్రకాశించుచున్నవి. శత్రురాజుల రక్తముచే కావేరీ నీర మెఱ్ఱఁబడిన దనుటచే శత్రుశేషము లేకుండుటయేగాక ఎందఱు రాజులు సంహరింపఁ బడిరనునది యాలోచనాగమ్యమై యతిమనోజ్ఞముగ నున్నది. పంకజరజము, కుంకుమము, గైరిక ద్రవమును ఒకదానికన్న నొకటి విస్తృతములై సారాలంకార శోభితములగుటయేకాక రక్త ప్రవాహములోని బీభత్సమును గప్పిపుచ్చుచు కడుమనోజ్ఞముగ నున్నవి' అని ప్రశంసించెను.

రామభ: భట్టుమూర్తి రసజ్ఞత అనమానమైనది కదా !

కృ॥ రా: తరువాత?

సూర : అట్లు ప్రశంసించుచు సంతోషపారవశ్యమున లేచి వారికి పాదప్రణామ మొనర్చి వారిపై నొక పద్యము నాశువుగఁ జెప్పెను.

కృ॥రా: ఏ పద్యము? (భట్టుమూర్తి వంకఁ జూచును.)

భట్టు : కం॥ మా కొలఁది జానపదులకు
నీ కవనపు టీవి యబ్బునే? కూపనట
ద్భేకములకు గగన ధునీ
శీకరముల చెమ్మ, నంది సింగయతిమ్మా!
(చాటు-మణిమంజరి 1 భాగము 109 పద్యము)

కృ॥రా : భేష్! చక్కఁగా చెప్పితివోయీ! (సూరనవైపు చూచి) తరువాత?

సూర : ఆ పద్యమును విన్నంతనే తిమ్మన్నగారు లేచివచ్చి ఇతనిని గాఢముగఁ గౌఁగిలించుకొని ఆశీర్వదించుచు ఈ కుండలమును ప్రసాదించిరి.

ధూర్జ : (నవ్వుచు) ఇంత యనుగ్రహించి ఒక్క పద్యమునకు ఒక్క కుండలము నిచ్చిరా? ఇదేమో బేరములోని తూఁకమువలె నున్నదే!

మల్ల : ఈయువలయునని బుద్ధిపుట్టినచో రెండు నీయవలయును గాని యొక్కటి యిచ్చుట యేమి?
(అందఱును తిమ్మన్నగారివంక కుతూహలముతోఁ జూతురు.)

తిమ్మ : నేనును రెండింటి నీయవలయునని యే తీసితిని. కాని రాయలవారి యనుగ్రహభారమే యడ్డుపడినది.

కృ॥రా : ఏమి! నా యనుగ్రహ భారమా!

తిమ్మ : చిత్తము ప్రభూ! వీనిని తమరు పారిజాతాపహరణ కృతిస్వీకార సందర్భమున మిక్కిలి ప్రీతి పురస్సరముగా నొసంగి యుంటిరి. వీని నితరుల కొసంగుట తమ ప్రీతి ప్రదానమును తక్కువ పఱచినట్లగును. అయినను వితరణ లౌల్యమున ఒకదాని నొసంగినను రెండవదాని నీయఁజాలక పోయితిని.

పెద్ద : తిమ్మన్నగారి ఉచితజ్ఞత సామాన్యము కాదు.

రామభ : ఎట్లయిననేమి! పద్యము రత్నకుండలమునకు సమముగా తూఁగుచున్నది.

మల్ల : తూఁకమునకేమి? ప్రశంసకదా యిందు పరమార్థము! పాత్రకు లొంగనివాఁడు కలఁడా?

తిమ్మ : ఐనచో నేను ప్రశంసా మాత్రమునకు లోఁబడి కంఠిలము నిచ్చితిననియా మీ యభిప్రాయము! పద్యముకూడ రత్నమువలెనే యున్నది.

రామకృ : ఆ పద్యమునకు వంక పెట్టువారు కలరా!

మల్ల : వంకలు పెట్టుటయు నొక పనియేనా? నేఁడేమో నీవు భట్టుమూర్తి యెడల కడు ప్రసన్నుఁడవై యున్నావే!

రామకృ : నే నెప్పుడును గుణాభిలాషిని. ఆ పద్యము ప్రత్యక్షర రమణీయముగ నున్నది. కనుక ప్రశంసించితిని.

తిమ్మ : జను ఇంత యెందులకు? అందొక్క యక్షరమునైనను ఎవరేని మార్చి మెఱుగు పెట్టఁగలిగినచో రాయలవారి యనుజ్ఞతో ఇదిగో ఈ రెండవ కుండలమును కూడ నిచ్చివేయుదును. (తీసి చేతిలో పెట్టుకొని చూపును.)

భట్టు : నేనును ఈ కుండలము నిచ్చివేయుదును.

కృ॥ రా: ఇది బాగున్నది. మంచి పందెమే. ప్రియతిన్నింపుఁడు.

పెద్దన : (కలయఁజూచి) మా కెవ్వరికిని స్ఫురించుటలేదు.

ధూర్జ : ఆ పద్యమునకు సవరణ ఏమి?

కృ॥ రా : (అందఱవైపు పారఁజూచి, నవ్వుచు) నాకు మాత్రము ఈ పద్యము తూఁకమున నొక్కరవ్వ తగ్గినట్లు తోఁచుచున్నది.

(అందఱు కుతూహలముతో రాయలవారివంకఁ జూచుచుందురు.)

తిమ్మ : సెలవిండు ప్రభూ!

కృ॥ రా : భట్టుమూర్తీ! ఆ పద్యమును మరలఁ జదువుము.

భట్టు : (నెమ్మదిగా)

కం॥ మా కొలఁది జానపదులకు
నీ కవనపు తీవి యబ్బునే? కూపనట
ద్భేకములకు గగవధునీ

కృ॥రా : (సౌంజ్ఞచేసి నిలిపి) అక్కడ 'నాకధునీ' అని మార్చి చదువుము.

భట్టు : (సంతోషముతో) ఓహో !

............కూపనట
ద్భేకములకు నాకధునీ
శీకరములచెమ్మ! నంది సింగయ తిమ్మా!

(చాటు మణిమంజరి 1 భాగము 109 పద్యము)

పెద్ద : తమ ప్రతిభ అసామాన్యమైనది.

తిమ్మ : నిజము, నిజము. 'ఆకాశం గగనం శూన్య' మని యుండఁగా 'గగనధునీ' యనుటయేమి! 'నాకధునీ' యనుటయే సరసము.

భట్టు : అనుప్రాస మెంత యద్భుతముగా కుదిరినది!

తిమ్మ : ప్రభూ ! తమరు సాహిత్యమునందును సమ్రాట్టులే! విజితులైన యీ సామంతుల కానుకలను పరిగ్రహింపుఁడు. (తిమ్మన భట్టుమూర్తి యిరువురును రెండు కుండలములను రాయలవారి ముందుంతురు.)

కృ॥రా : (నవ్వుచు) నరే ! మాపని లాభసాటిగనే యున్నది. ఎవరక్కడ !

(భటుఁడు ప్రవేశించును) క్రొత్త రత్నకుండలములను తెమ్ము. ఈ పాత్రితవారికి మెఱుఁగు పెట్టించి జతలుకూర్చి వారి యింటికి చేర్పుము.

పెద్ద : ప్రభువుల యౌదార్యము అనుపమానము

సూర్జ : సందేహమేమున్నది?

(భటుఁడు కుండలములు తెచ్చి యీయఁగా తిమ్మన, భట్టుమూర్తులు ధరించుచుందురు.)

దౌవారికుఁడు : (ప్రవేశించి) ప్రభూ! చిన్న తిమ్మన్నగారు నృసింహ కవిగారితో కూడ వచ్చి తమ దర్శనము కోరుచున్నారు.

ప్రౌ॥రా : వెంటనే ప్రవేశపెట్టుము. (దౌవారికుఁడు వెళ్ళును. చిన్నతిమ్మన, నృసింహ కవియును ప్రవేశింతురు.)

చి॥తిమ్మ : ప్రభూ ! అభివాదనములు.

నృసింహ : మహారాజా ! విజయోస్తు.

ప్రౌ॥రా : మహాకవీ ! ప్రణామములు. ఆసనమలంకరింపుఁడు.

నృసిం :

మ॥ నరసాధీశ్వరు కృష్ణరాయ జగతీనాథా ! భవత్కీ-
ర్తికిన్। సుర కల్లోలిని వీఁగి భర్గుని జటాజూటంబు
ప్రాపించె, నా । హరుఁ డవ్వాహిని వార్ధి
ముంచుట భయస్వాంతాంకుఁడై పూనె, నేఁ
గరిచర్మంబు కపాలమున్ భసితమున్ ఖట్వాంగ
మున్ శూలమున్.

(చాటు - మణిమంజరి 2 వ భాగము 75 పద్యము)

(అందఱును హర్షమును సూచింతురు)

కృ॥రా : (చినతిమ్మనతో) మొత్తముమీఁద మీరు మాట లోనే మహాకవిని గొనివచ్చినారు.

చి॥తిమ్మ : చిత్తము ! తమ యాజ్ఞఁ దాటుదునా !

ధూర్జ : (చినతిమ్మనను చూపి రామభద్రునితో) వీరెవరు !

రామభ : కొప్పోలు కరణముగారు. చదరంగమున అందె వేసిన చేయి; ప్రభువుల కాంతరంగిక మిత్రులు.

నృసింహ : వారి సంగతి నన్నడుగుఁడు.

కం॥ శతసంఖ్య లెక్కలైనను
సతతము శ్రీకృష్ణరాయ జగతీపతితోఁ
జతురంగ మాడి గెల్చును
ధృతిమంతుఁడు బొడ్డుచర్ల తిమ్మన భళిరే !
(చాటు-మణిమంజరి 1 భాగము 155 పుట)
(అందఱు నవ్వుచుందురు)

చి॥తిమ్మ : ప్రభువులముందు నన్ను బ్రశంసింతు వేమయ్యా!

కృ॥రా : (నవ్వుచు) దాని కేమి? మాయెదుట నితరుల ప్రశంసింపరాదను నియమమేమున్నది? ఎవరిని ఎవరు ప్రశంసించినను మాకు కావలసినది సాహిత్యమే కదా !

చి॥తిమ్మ : తమ యౌదార్యము అనుపమానము. ఇంక సెల విచ్చినచో నేను పురకాంత దర్శనము చేసికొందును.

కృ॥రా : అంత తొందరయేమి ? మీరును సాహిత్య రస జ్ఞులుగదా! గోష్ఠియందుఁ బాల్గొనుడు.

చి॥తిమ్మ : దేవరవారు మన్నింపవలె. వేఱే తొందర పను లున్నవి. మరలవచ్చి తమ దర్శనము చేసి కొందును.

కృ॥ రా : అట్లే వెళ్ళిరండు. (చినతిమ్మన నిష్క్రమించును. నృసింహ కవివైపు సాదరముగాఁ జూచుచు) తమ స్వగ్రామమేది ?

నృసింహ : కడప మండలములోని సుంకేసుల.

కృ॥రా: తమ రేయే శాస్త్రములందుఁ బరిశ్రమ చేసితిరి?

నృసింహ : సంస్కృతమున సాహిత్యము కుదిరిన తరువాత కొలఁదిగ వ్యాకరణమున పరిశ్రమచేసితిని. అయినను నాకు తెలుఁగు కవిత్వమునందే యభిమానము, అభి నివేశమును కలిగినది.

ధూర్జ : మీరు రేదేని కావ్యమును రచించినారా ?

నృసింహ : ఒక మహాప్రబంధమును కడు పరిశ్రమతో నిర్మించితిని. దానిని విద్యా విశేషజ్ఞులగు ప్రభువుల సమక్షమున విన్పింప వలయునని, (రాయలతో) తమరు విని యసాధారణమైన నా కావ్య విశేష మును గుర్తించి కృతార్థుని జేయుదురని గొప్ప యాశతో వచ్చితిని.

కృ॥ రా: మంచిదే! కావ్యమును విన్పింపుఁడు.

(నృసింహాకవి గ్రంథమును విప్పుచుండును)

రామకృ: అయ్యా! నాకొక సందేహము కలిగినది.

నృసింహ: తప్పేమి! తెలుపుఁడు. ఎవరెట్టి సందేహములు వెలిబుచ్చినను వానిని తప్పక తీర్చెదను. వాదమున కైనను జంకువాఁడను గాను. మీరు నిస్సంకోచముగ నడగవచ్చును. ఏమి మీ సందేహము?

రామకృ: మిమ్ముఁ బ్రశ్నింపఁ గలిగినంతవాఁడనుగాను. ఏదో బాల్యచాపల్యమింకను వీడక అడుగుచున్నాను. అసాధారణమైన కావ్యవిశేషమని యంటిరిగదా! ఆ మాట కర్థమేమి?

నృసింహ: అందు సందేహమున కవకాశమేమున్నది?

రామకృ: మఱేమియును లేదు. అసాధారణమైన దానినేకదా విశేషమందురు. మరల మీరు దానిని అసాధారణమని చెప్పుట యెందులకు...అని.

ధూర్జ: మంచి సందేహమే!

నృసింహ: దానికేమున్నది? నేను అసాధారణ శబ్దమును సాభిప్రాయముగనే ప్రయోగించితిని. ఇతర కావ్య విశేషములను అతిశయించుచుండుటే ఇందు అసాధారణత్వము.

రామకృ: ప్రాచీన కావ్యములందును మీ యతిశయ మన్వయించునా?

నృసింహ: 'శాంతం పాపమ్!' ప్రాచీన కావ్యములఁ గూర్చి యట్లు పల్కుదునా?

రామకృ: అయినచో మీ యతిశయము ఈకాలపు కృతులకే అన్వయించు నన్నమాట.

సూర: అయ్యా! చల్లకువచ్చి ముంత దాఁచనేల? కవులు రచించిన మనుచరిత్రాది కావ్యములను తమ ప్రబంధము సర్వధా అతిశయించుననియే కదా మీ యభిప్రాయము!

ధూర్జ: ఇది నిజమా!

నృసింహ: ఔను. అందులకు సందేహమేమున్నది? తారతమ్య పరీక్షకు ప్రభువులే ప్రమాణము.

రామకృ: చిత్తము! చిత్తము! దానికేమి? ఇంతకును తమ ప్రబంధ మేదియో చెప్పితిరి కాదు.

నృసింహ: మాంధాతృ చరిత్రమును కవికర్ణరసాయనమను పేర రచించితిని.

రామభ: పేరులోనే ప్రతిభ వ్యక్తమగుచున్నది.

రామకృ: అయ్యా! ఇది కవికర్ణరసాయనమేనా? కవులు కానివారి కర్ణముల కుపయోగింపదా?

నృసింహ: ఉత్తమ కావ్యములు సంస్కార సంపన్నులైన కవుల కాస్వాద్యమైనట్లు ఇతరుల కెట్లగును?

ధూర్జ : పండిత పామర రంజకములైన భారత భాగవతాది గ్రంథములు ఉత్తమ కావ్యములు కావా? సకలజన రంజకమైనదిగదా ఉత్తమ సాహిత్యము!

రామకృ : అయ్యా! ఎవరి సంగతి ఎట్లున్నను ఈ కావ్య శ్రవణముతో నాకుఁ బనిలేదు.

కృ॥రా : (నవ్వుచు) ఏమి అట్లంటివి?

రామకృ : నేనును కవినే. కాని యిప్పటికి ఈశ్వరాను గ్రహమున నా చెవులు చక్కఁగానే యున్నవి.

కృ॥రా : దానికిని దీనికిని సంబంధము?

రామకృ : సంబంధము లేకేమి? రసాయనములు వైద్య శాస్త్ర ప్రసిద్ధములు. కావున ఈ రసాయనముకూడ కవుల కర్ణముల కేదేని దోషము కలిగినచో నివారించు ననుకొందును. నాకే దోషమును లేదు. వ్యాధి లేకుండ ఔషధమును సేవించినచో లేని రోగము వచ్చును. (అందఱును నవ్వుదురు. నృసింహకవికి ముఖ మెఱ్ఱవారుచుండును.)

కృ॥రా: పేరును గూర్చియే ఇంత రాద్ధాంతమేల? అసలు కావ్యమునుగదా వినవలయును?

ధూర్జ : ఇంతకును వారు తమ కావ్యవిశేషమెట్టిదియో వివరింపలేదు.

నృసింహ : ఇదిగో చెప్పుచున్నాను వినుడు.

తే॥ గీ॥ యతి విటుఁడు గాకపోవు టస్మదీయ
కావ్య శృంగార వర్ణనాకర్ణనమున
విటుఁడు యతి గాకపోరాదు వెస మదీయ
కావ్యవైరాగ్య వర్ణనాకర్ణనమున
(కవికర్ణ రసాయనము, పీఠిక 22 పద్యము)

సూర : మంచి ప్రతిజ్ఞయే.

భట్టు : ఈ కావ్యమున శృంగార వైరాగ్యములు నిండారి యున్నవన్నమాట!

రామకృ : సరే! 'వెసమదీయ' అనఁగానేమి?

నృసింహ : ఏమి ఇంతమాత్రము పద విభాగము తెలియదా? 'వెసన్ మదీయ' అని విభాగము.

ధూర్జ : కావ్యారంభముననే, అందును ప్రతిజ్ఞా వాక్యముననే, పాదపూరణము 'వెసన్' వచ్చినదా? బాగున్నది.

రామకృ : అయ్యా! 'అస్మదీయ' కును 'మదీయ' కును భేదము కలదా? లేదా?

నృసింహ : లేకేమి? భేదము ప్రసిద్ధముకదా! మొదటిది బహువచనము. రెండవది యేకవచనము.

రామకృ : అట్లయినచో ఈ గ్రంథమున పూర్వార్ధమును మిత్రుల సహాయముతో రచించి, ఉత్తరార్ధమును తమరొక్కరే యసహాయ శూరులుగా రచించినారన్నమాట.

నృసింహ : అదేమి యట్లందువు? నాకొకరు సహాయు లగుట యేమి? ఆ బహువచనమును పూజార్థమున గ్రహింప వలయును.

రామకృ : చిత్రము! చిత్రము! కాళిదాసంతవాఁడు 'గమిష్యా మ్యుపహాస్యతామ్' అని ఏకవచనముననే తన్నుఁగూర్చి చెప్పుకొన్నాఁడుగదా! తమవంటి మహాకవులు ఆత్మస్తుతిగా పూజార్థమున బహువచనమును ప్రయోగింతురా అను సంశయముతో నడిగితిని.

ధూర్జ : తెలుఁగునఁగూడ నన్నయ తిక్కనాది మహాకవు లందఱును తమ విషయమును ఏకవచనముననేకదా చెప్పుకొన్నది?

సూర : అసలు 'అస్మదీయ' అని చెప్పుకొన్న తరువాత 'మదీయ' ఎందులకు?

రామకృ : దండుగకు.

భట్టు : పద్యమున కర్థము ముఖ్యముగాని ఈ పదముల వేఁట ఎందులకు?

రామకృ : ప్రభూ! ఏదియెట్లయినను నృసింహకవిగారు కడుంగడు తెలివిగలవారు.

కృ॥ రా : (వికాసముతో) ఎందువలన?

రామకృ : నిరూపించుటకు వీలులేని ప్రతిజ్ఞనుచేసి అందఱను వేలు పుచ్చుచున్నారు.

నృసింహ : ఇది నిరూపించుటకు వీలుకాదా! ఎట్లు చెప్పుము.

రామకృ : చిత్రము! అయ్యా! ఈ ప్రతిజ్ఞయందు రెండంశములు కలవు. శృంగార వర్ణనా కర్ణమున యతి విటుఁడగుట మొదటిది. వైరాగ్య వర్ణనా కర్ణనమున విటుఁడు యతి యగుట రెండవది.

ధూర్జటి : ఒక్కొక్క యంశమును విడివిడిగా వివరింపుము.

రామకృ : మొదటిదానిని పరిశీలింపుఁడు దీనిని నిరూపించుటకు ఒక యతిని తీసికొని వచ్చి ఈ కావ్యములోని శృంగార ఘట్టములను వినిపింపవలయునుగదా!

ధూర్జ : ఔను.

రామకృ : ఆ యతి ఈ కావ్యమహిమచే విటుఁడైనచో నెట్లు?

నృసింహ : అయినచో కావ్యప్రభావమే వ్యక్తమగును.

రామకృ : ఓహో! ఇదియా తమ కావ్యప్రయోజనము. (స్వరమును హెచ్చుచేసి) సన్యాసి విటుఁడగుట ఆరూఢ పతనముగదా! ఈ మహాపాపముకూడ తమకు కావ్య ప్రయోజనముగా అభిమతమా?

నృసింహ : ఆ వాక్యమున కల్లెందులకు అర్థము గ్రహింపవలయును? యతి యనఁగా విరక్తుఁడని విటుఁడనగా భోగపరుఁడని లాక్షణికార్థమును గ్రహింపవచ్చును.

రామకృ : వాచ్యార్థము కుదురకుండినచో కదా లాక్షణికార్థమును గ్రహించుట? ఇచ్చట వాచ్యార్థమునకు లోపమేమున్నది?

నృ:రా : దానికేమిలే? వాచ్యార్థమున అసామంజస్యము

కన్పించునప్పుడును లాక్షణికార్థమును గ్రహించినచో తప్పేమి ?

రామకృ : సరే ! అట్లే గ్రహింతము. అయినను పైన చెప్పిన యుపప్లవము తప్పదు. యతి కాకున్నను యతి కాఁదగిన వైరాగ్యసంపన్నునకు కూడ ఈ కావ్య శ్రవణమున చిత్త చాంచల్యము కలుగనున్నచో మనవంటివారి గతి యేమి ?

నృసింహ : మీరు ప్రతి విషయమును కడు వికటముగ వ్యాఖ్యానించుచున్నారు. విరక్తులైనవారికి కూడ ఈ శృంగార వర్ణనము ఆహ్లాదము కలిగింపఁగలదనియే తాత్పర్యము. కాని అందఱను ధర్మభ్రష్టులను చేయునని కాదు.

రామకృ : ఓహో ! అట్లయినచో అంతమాత్ర మాహ్లాదమును ఇతర కవులు కలిగింపలేరా ? కలిగింపలేరని మీరెట్లు నిరూపింపఁ గలరు ? ఇంక మీ విశేష మేమున్నది ?

సూర : ఇంక రెండవ యంశమును విచారింపనే యక్కఱ లేదు. తమ వైరాగ్య వర్ణనమున విటుఁడు కూడ యతి యగుటయే సంభవించినచో సామాన్యులందఱు సన్న్యాసులు కాకుందురా ?

ధూర్జ : అట్లు సన్న్యాసులు కాఁగలిగినను కొంత మేలే; కాని అట్టివారు శ్మశాన వైరాగ్యమువలె వచ్చిన యా

వైరాగ్యావేశము దిగిన వెంటనే మరల సంసారము నకుఁ బొల్పడకుందురా ?

రామభ : కావున ఈ యంశము కూడ ఆరూఢపతనమునకే దారితీయుచున్నది.

కృ॥ రా : అయ్యా ! ఉపోద్ఘాతముపైననే యింత యుపన్యాస మెందులకు ? అసలు కావ్యమునుబట్టి కదా గుణ దోషములను నిర్ణయింపవలె ?

నృసింహ : ఇన్ని కుయుక్తులు, ఇంత వికట వ్యాఖ్యానము పరిబలి మనస్సులు వికలములై యుండఁగా కావ్య రసాస్వాదనమునకు అవకాశమున్నదా ? (రాయ లతో) కావ్య గోష్ఠి ఇట్లుండునా ? మీరును చూచు చున్నారుకదా ?

కృ॥ రా : అయ్యా ! నేనేమి చేయుదును. ఎట్టి సందేహముల కైన సమాధానము చెప్పఁగలమని, వాదమునకు జంకమని మీరేకదా ఈ వివాదమును ప్రోత్సహించి తిరి ?

పెద్దన : అయ్యా ! ఇప్పుడు మించిపోయినదేమున్నది. మా రామకృష్ణుఁడు తెలిసియో తెలియకయో కొన్ని సందేహములను తెలిపియున్నాఁడు. వానికి మీరు సమాధానము చెప్పినచో విని సంతోషించుటకు మేము సిద్ధముగనె యున్నాము.

నృసింహ : ఏమైనను కావ్య విషయమున నింత తర్కమెందు లకు ?

రామకృ : ప్రతిజ్ఞా వాక్యముకూడ కావ్య విషయమేనా? ఇందురస భావముల కేమి సంబంధమున్నది? వాక్య మేదైనను యుక్తి సహముగా నుండ నక్కఱలేదా?

నృసింహ : యుక్తి మాత్రముననే విషయము వ్యవస్థిత మగునా? ఈ నాఁడు మీరు నన్ను మించినచో, మిమ్ము మించువాఁడు రే పింకొకఁడు రాగలఁడు.

రామకృ : అయ్యా! చింత చచ్చినను పులుసు చావలేదన్న ట్లున్నది మీ ప్రసంగము. వారము కాదు. పక్షము కాదు. నెలరోజులు గడువిచ్చుచున్నాము. మీకాప్తులైన మహాపండితులతో విచారించియే సమాధానము చెప్పఁడు.

మొదటి వంది :

కం॥ శ్రీ వేంకటగిరి వల్లభ
సేవా పరతంత్ర హృదయ, చిన్నమదేవీ
జీవిత నాయక! కవితా
ప్రావీణ్య ఫణీశ। కృష్ణరాయమహీశా।

(పారిజాతాపహరణము. 4 ఆ. 1వ పద్యము)

రెండవ వంది :

చం॥ తనువును నందకారపుమదం బల మిన్ననుభద్ర
దంతికిన్। మొనసినఁ జింధ రేఁగి తపనుం డను
మావుతుఁ గ్రుంకుమెట్టలో। యమరలవై చిన్న
న్నాగిలి యచ్చట నెత్తురు గ్రక్కెనో యనం

గనుఁగవ గోరగింపఁ బొడకట్టె సముజ్వల సాంధ్య
రాగముల్.

(పారిజాతాపహరణము. 2 అ. 32 పద్యము)

నృసింహ : ప్రభూ ! మఱియొక సమయమున వచ్చి తమ కీ
కావ్యమును విన్పింతును. (గ్రంథమును కట్టిపెట్టు
చుండును)

కృ॥ రా : మంచిదట్లే చేయుఁడు. మీరు ఎప్పుడు వచ్చినను
మాకు సంతోషమే. (ప్రక్కకు చూచి) ఎవరక్కడ?
(భటుడు ప్రవేశించును) పూజాద్రవ్యములను దెమ్ము.

రామకృ : మీ రిచ్చటి కవుల నందఱను ధిక్కరించి ప్రసం
గించుచుండుటచే మేమును ఆక్షేపింప వలసి వచ్చినది.
జరిగినదానిని మనసునఁ బెట్టుకొనకుఁడు. మీరు ప్రశాంత
చిత్తులై ఎప్పుడు వినిపించినను మీ కావ్యమును విను
టకు మేము సిద్ధముగనే యున్నాము.

పెద్దన : కొన్ని ఘట్టములు నేను విన్నానుగదా! కవిత్వము
చాల రమణీయముగ నున్నది.

తిమ్మన : (ధూర్జటి నుద్దేశించి) మాకును వినవలయునని
కుతూహలముగనే యున్నది. (భటుఁడు పూజాద్రవ్య
ములు, వరాల సంచియు తెచ్చును.)

కృ॥ రా : (దిగివచ్చి నృసింహకవికి అర్పించి) ఇప్పటి కీ
పారితోషికమును పరిగ్రహింపుఁడు

నృసింహ : (సంకోచించుచు) ప్రభూ ! తమకు నా వలనఁ గలిగిన పరితోషమేమున్నది ? కావ్యమున నొక ఘట్టమైనను తమకు విన్పింపలేదు.

కృ॥ రా : మేము కవులను సత్కరించుట కేవలము మా యానందము కొఱకేగాదు. ఈ మహాకవుల కావ్యముల వలన మా రాజ్యములోని ప్రజలేనా, దేశ దేశములలోని ప్రజలును తరతరములవారును ఆనందింతురుగదా ! మాకు సంబంధించినను, సంబంధింపకున్నను, వినుట కవకాశమున్నను లేకున్నను మహాగ్రంథములను రచించినవారినందఱను సత్కరించుట మా ధర్మము. స్వీకరింపుఁడు.

నృసింహ : ప్రభూ ! తమ వదాన్యత అనుపమానము. (స్వీకరించును) (రాయలు తక్కిన కవులను సత్కరించి వెడలిపోవుదురు. పెద్దనాదులు కుడివైపుగా, ధూర్జటి ప్రభృతులు, నృసింహకవియు నెడమవైపుగా నిష్క్రమింతురు.)

(తెర వ్రాలును)

---

# భువనవిజయము

## చతుర్థాంకము

(శ్రీకృష్ణదేవరాయల యశఃపురములో నొక గది. ఒక రాజాసనము, రెండు కుర్చీలు, వక్కగా చాపపై గూర్చుండి వ్రాయుటకు బల్ల యుండును. రాయలొక పద్యము నాలోచించుచు వచారు చేయుచుండును. కొంచెము దూరమున తిమ్మప్ప ప్రభువు వంక కుతూహలముతోఁ జూచుచుండును.)

రాయలు : (తిమ్మప్ప వంకఁ జూడకుండఁగనే) పత్రము ! గంటము.

తిమ్మప్ప : తొందరతో) చిత్తము ప్రభూ ! (ప్రక్కకు పోయి తాటియాకులను గంటమును తెచ్చును.)

రాయలు : కూర్చుండి, కనులు మూసికొని ఆలోచించుచు పద్యమును చెప్పుచుండును. తిమ్మప్ప నెమ్మదిగావచ్చి బల్లముందు కూర్చుండి వ్రాయుచుండును.)

తే॥ గీ॥ "ఆత్మవత్సర్వభూతాని" యనుట బొంకె
ముద్దియలకైన వలవంత ముచ్చటలను
ఆటపాటలఁ గతలఁ గొంతడఁగుఁగాని
.. .........................

(ఆముక్త, 5-43)

(రాయలు పై పాదము స్ఫురింపక కనుల తెఱవక యే ఆలోచించుచుండును. తిమ్మప్ప రాయలవైపు కొంచెము సేపు చూచి మరల ఆకువైపు చూచుచు మెల్లఁగా చదువుచుండును.)

రాయ : (కనులు తెఱచి కుతూహలముతో నవ్వుచు)
ఎవరు? నీవా! తిమ్మప్పా!

తిమ్మ : (సంభ్రమముతో ఆకులు, గంటలు బల్లపై పడవైచి లేచి) చిత్తము ప్రభూ! చిత్తము. క్షమించవలె. ఆలస్యమైనచో తమ కవిత్వావేశమునకు భంగము కలుగునేమో యని...... (భయముతో చేతులు నలుపుకొనుచుండును.)

రాయ : సరే! వ్రాయసకాఁడు నరసప్ప ఏమైనాఁడు?

తిమ్మ : తమరు అతనిని సాయంకాలపు గోష్ఠికి కవులను, పండితులను ఆహ్వానించుటకు పంపించినారు ప్రభూ!

రాయ : ఓహో! ఔను. మఱి నీవును వ్రాయఁగలవా! ఏది!
(కుతూహలముతో నవ్వుచు చేయి చాపును)

తిమ్మ : ప్రభువులు మన్నించవలె. (ఆకును అందించును)

రాయ : (తీసికొని, చూచి, నవ్వుచు) పరవాలేదు. బాగుగానే వ్రాయఁగలవే! అక్షరములు ముత్యాలకోవవలె నున్నవిరా!

తిమ్మ : (వినయముతో, సంతోషించుచు) అంతయు ప్రభు
వుల దయ ! (తలవంచి నమస్కరించును)

రాయ : ఎంతవఱకు చదువుకొంటివి ?

తిమ్మ : (ఉత్సాహముతో) ఎంత చెడినను మేము భట్రాజుల
ముగదా ప్రభూ! మా నాయనగోవిందరాజు నంద్యాల
వారి యాస్థానములో వ్రాయసకాఁడుగా వుండి
గ్రంథము లన్నియు వ్రాయుచుండెడివాఁడు. అప్పు
డాయన భారతములో భాగవతములో మంచి ఘట్టా
లన్ని చెవులు నులిమి నాచేత చదివించినాఁడు. తరు
వాత ఆ రాజుగారు పోయి, మా నాయన గతించి,
మేము అష్టకష్టాలువడి పొట్ట చేతపట్టుకొని యిక్క
డకు వచ్చి తిమ్మరుసయ్యగారిని ఆశ్రయింపఁగా
వారు "అంతఃపురములలో కావలివాని పనికాళీగా
ఉన్నది, చేరుదువా." అని అడిగినారు. ధర్మప్రభు
వులు తమ సేవలో ఎక్కడ ఉన్నను మంచిదే అని
యీ ఉద్యోగములోనే ఉన్నాను ప్రభూ !

రాయ : నీకు భారత భాగవతములలోని పద్యములు కంఠస్థ
ములా ! ఇంక కవిత్వాపేక్షకు లోప మేమున్నది !

తిమ్మ : చిత్తము ప్రభూ ! చిత్తము. తమ సన్నిధానములో
కవులు పద్యాలు చదువునప్పుడు నా కన్నులు
ద్వారము వైపున్నను చెవులు మాత్రము పద్యాల
మీఁదనే యుండును.

రాయ : ఓహో! రసికుఁడవే! నా పద్యములు కూడ విను చునే యున్నావా?

తిమ్మ : చిత్తము ప్రభూ! తమరు మహారాణులకు వినిపించు చుండఁగా ఈ గ్రంథములో చాల పద్యాలు విన్నాను ప్రభూ!

రాయ : సరే! నీ కిందులో నచ్చిన పద్యాలేవో చెప్పు.

తిమ్మ : (కొంచెము సేపు నేలపై చూపులు నిలిపి జ్ఞాపకము చేసికొనుచు) "దేశభాషలందు తెలుఁగు లెస్స" అను పద్యము, "నృహరీ! వాదములేల లేరె యితరుల్ నీలీలకుం బాత్రముల్" అన్నది, "యిసుమంత టెంగణావు" అనునది, యిప్పుడు తమరు చెప్పుచున్నది-యివి నాకు బాగా నచ్చినవి ప్రభూ!

రాయ : మంచి ఘట్టములే పట్టినావు! బలే బాగున్నది! (కొంచెమాగి) తక్కిన గ్రంథమసలు నీకు బోధపడు చున్నదా?

తిమ్మ : (భయముతో) ప్రభువులు క్షమించవలె! నాదే మున్నది పామరుఁడను తమ పద్యాలను అర్థము చేసి కొను శక్తి నాకెక్కడిది ప్రభూ! కొన్ని పద్యాలు బాగుగానే తెలియుచున్నవి ప్రభూ!

రాయ : మఱి భారత భాగవతాలలో?

తిమ్మ : వానిలోకూడ కొన్ని పద్యాలు అర్థము కాకపోయి నను మొత్తముమీఁద గ్రంథము పొడుగునను తాత్పర్యము తెలియుచునే యుండును. ప్రభూ!

రాయ : (తలపంకించి) అవును ! ఇతిహాస పురాణములకు కావ్యములకు సహజముగనే భేదము కలదు. (కొంచె మాగి) దానికేమిలే ! కావ్యములలో మాత్రము ఆంధ్రకవితా పితామహుని రచన ఆ పాత మధురమే కదా !

తిమ్మ : చిత్తము ! చిత్తము ! అందులకు సందేహమేమున్నది? కానీ...

రాయ : (తల పైకెత్తి తిమ్మన్న ముఖమున చూపు నిలిపి) నీ సందేహమేమి ? భయములేదు. చెప్పుము.

తిమ్మ : (సంకోచముతోనే) మరేమిలేదు. వారి కవిత్వ మనంగా పుట్టతేనె కదండి ! అయినను వారు ప్రవరయ్యగారిని తిట్టుట మాత్రము నాకేమీ నచ్చలేదు ప్రభూ !

రాయ : (కుతూహలముతో) మనుచరిత్రలో ప్రవరాఖ్యునా! తిట్టుట యేమి ?

తిమ్మ : మఱి ఆ పద్యము... (అని కంఠము సవరించుకొనుచు నూరకుండును)

రాయ : ఏ పద్యమది ? చదువుము. సంగీతముకూడ వచ్చినట్లున్నదే ! ఏదీ పాడుము.

తిమ్మ : సూర్యాస్తమయ వర్ణనములోని పద్యము ప్రభూ !

చం॥ తరుణి ననన్యకాంత నతిదారుణ పుష్పశిలీ
ముఖవ్యథా। భరవివశాంగి, నంగభవు బారికి
నగ్గముసేసి క్రూరు(డై। యరిగె మహీసు
రాధము( డహంకృతితో నని రోషభీషణ।
స్ఫురణ వహించెనో యన నభోమణి దాల్చె(గ
షాయ దీధితిన్ ।

(111 అశ్వా-10 పద్యము)

పాపమా ప్రవరయ్య ఏమి తప్పు చేసినా(డని క్రూరు(డు, మహీసు రాధము(డు అని తిట్టినట్లు ప్రభూ !

రాయ : ఊఁ ! (ఆలోచించుచుండును

తిమ్మ : అది కాదండి ! నిర్మానుష్యములైన కొండకోనలలో అమాంతముగా అప్సరసవంటి పిల్ల కన(బడినచో, అదిదయ్యమో, భూతమో, రాక్షసమారో అని ఎవరి కైనను భయమే కదండీ ! (కొంచెము దూకుడుగా) అసలదిగాక యింకొకమాట అడుగుదునా! (జంకును)

రాయ : (నవ్వి) ఫరవాలేదు అడుగు.

తిమ్మ : మఱి ప్రవరయ్యగారు బలే నైష్ఠికు(డు గదా ! బ్రాహ్మణులు తాకినసే మైలపడితినని స్నానాలు చేయువా(డాయెనే ! ఏ కులముదో, ఏ జాతిదో, ఎవతో వచ్చి వచ్చి బోగముదానివలె పైనబడినచో

తన్ని తఱిమి వేయక, తప్పక దగ్గఱకు తీసికొనవలె ననుధర్మము ఎక్కడ నున్నది? తఱిమి వేసినచో తప్పేమి? అసలాయనకు అంతమాత్రము స్వాతంత్రము లేదా? ధర్మప్రభువులు తమరే సెల వీయుండి.

రాయ: (కుతూహలముతో నవ్వుచు ఊఁ!...సరే! బాగున్నదిరా నీ విమర్శ! పెద్దన్నగారిని నిలువఁ బెట్టి అడుగవలసినదే ఈ ప్రశ్న!

తిమ్మ: (భయపడుచు) యహో ప్రభువులు దయచూడవలె! నా మొగము! నా విమర్శ ఏమిటి ఏలినవారు చను వీయఁగా ఏదో తోఁచిన మాట అంటిని. తమ కాళ్ళకు మ్రొక్కుదును. ఆయనతో అనవద్దు ప్రభూ!

రాయ: ఏమిరా భయము?

తిమ్మ: అమ్మ బాబో! కవులన్ననే భయము ప్రభూ! వారికి కోపమువచ్చి నా మీద పద్యము చెప్పినచో నింకేమయినఁ గలదా? నాకు వీధులలో తాటాకులు కట్టరు? అందులో పెద్దన్నగారైనచో ఊరకుందు రేమో కాని రామకృష్ణ కవిగారు విన్నచో బ్రతుక నిత్తురా ప్రభూ!

రాయ: సరే! చెప్పనులేరా! భయపడకు. ఒడలు విఱుచు కొని ఆవులించుచు)

తిమ్మ : ప్రొద్దుటినుండి తమరు హోమాలు, దానాలు చేసి చాల అలసిపోయి యున్నారు. కొంచెము విశ్రాంతి తీసికొనుడు ప్రభూ! (తాటాకులు సర్దుచుండును)

రాయ : అదికాదురా! నేడు పుట్టినరోజు పండుగకదా! ఒక పద్యమైనను వ్రాయవలె ననుకొంటిని. ఏదీ! మరల ఆ మూడు పాదములు చదువుము.

తిమ్మ : తే॥ "ఆత్మవత్సర్వ భూతాని" యనుట బొంకె
ముద్దియలకైన వలపంత ముచ్చటలను
ఆటపాటలఁ గతలఁ గొంతడఁగుఁగాని
... ... ... ... ... (ఆముక్త 5-43)

(రాయలు కనులు మూసికొని ఆలోచించుకొను చుండును. తిమప్పకూడ ఆలోచించుచుండును )

తిమ్మ : గోదాదేవిగారుగదా ప్రభూ యిట్లు అనుచున్నది ?

రాయ : అవునురా! మత్స్య కూర్మా ద్యవతారములలో విష్ణువునకు భార్యలు లేరుగాని ఉండినచో వారి బాధ తన బాధకన్న హెచ్చుగానే యుండునని ఆమె తలంచుచున్నది.

తిమ్మ : తలనూపుచు) చిత్రము! చిత్రము! (పద్యపాదములు నెమ్మదిగా చదువుచు) ప్రభూ! ఇట్లు అనఁగూడదు ?

రాయ : ఏట్లు !

తిమ్మ : మనుష్యులైనచో ఎంత బాధైనను ఏదరితోనో ఒక రితో చెప్పుకొని వెళ్ళఁబోసికొందురు. మఱి నోరు లేని జంతువులకు నొప్పి ఘనము గదా! ప్రభూ!

రాయ : (చకితుఁడై) ఏమిటీ!...

తిమ్మ : నోరులేని జంతువులకు నొప్పి ఘనము అని చెప్పు చున్నాను ప్రభూ!

రాయ : (సంతోష విస్మయములతో) నోరులేని జంతువు లకు నొప్పి ఘనము బలే చెప్పితివిరా తిమ్మప్ప! పద్యము అద్భుతముగ పూర్తియైనది.

తిమ్మ : (గబగబ వ్రాసి) నిజముగానే ప్రభూ బాగానే కుదిరినదే!

రాయ : సమన్వయలైనే పూరించితివిరా పద్యమును. ఇదిగో నీకు బహుమానము. (ప్రక్కనున్న శాలువ తీసి యొసంగును)

తిమ్మ : (సంతోషముతో) అమ్మో! బహుమానమే! నాదే మున్నది? ప్రభూ! అంతయు తమ చలువే! తమరు సాక్షాత్తుగా భోజమహారాజులే ప్రభూ! తమ సముఖ ములో పామరునకుకూడ కవిత్వము వచ్చును ప్రభూ!

రాయ : (ఒడలు విఱుచుకొనుచు ఆవులించును)

తిమ్మ : ఇంక తమరు విశ్రాంతి తీసుకొనుఁడు ప్రభూ!

రాయ : సరే! నీవు ఇక్కడి వస్తువులు సర్ది భువనవిజయము

నకుపోయి గోష్ఠికి ఏర్పాట్లు చేయుచుండుము. నీ వీ శాలువు కప్పుకొనియే యుండుము. (రెండు అడుగులు వేసి వెనుకకు తిరిగి) యీ పద్యములనుగాని పద్య భాగములనుగాని ఎవరియొద్దను ప్రస్తావింపకుము. తెలిసినదా ! అసందర్భముగా పద్యములు బయల్పడుట తగదు. (తిమ్మప్ప నివ్వెఱపడిచూచుచుండును) ఏమట్లు చూచెదవు ? ఇప్పటికే ఇందలి పద్యము లేవైన బయట పొక్కినవా ?

తిమ్మ : (భయముతో) లేదు ప్రభూ ! లేదు.

రాయ : సరే ! (సాలోచనముగా వానివంకఁ జూచుచు నిష్క్రమించును)

(తిమ్మప్ప శాలువు కప్పుకొని తన్ను తాను చూచుకొని సంతోషించుచు పద్యము కూనిరాగముతో చదువుచుండును)

రామకృష్ణకవి : (ప్రవేశించి, ఎవరది !

తిమ్మ : (ఉలికిపడి) అయ్యో ! (చూచి శాలువుతీసి త్వరగా గ్రంథమును దాఁచును) ఏమి సెలవు !

రామకృ : (ఆశ్చర్యముతో) నీవా ! తిమ్మప్పా ! ఎవరో పండితుఁ డనుకొంటిని. ఈవేష మెప్పటినుండి ?

తిమ్మ : (వినయముతో) ఇప్పుడే మహారాజుగా రనుగ్రహించిరి.

రామ : నీకా ? ఏమి కథ ?

తిమ్మ : ఏమున్నది బాబయ్యా! వారేదో పద్యము చదువుచు "వ్రాయుమురా నరసప్పా!" అన్నారు. వాఁడు సమయమునకు లేకపోయె. అందులకని నేనే వ్రాసితిని. అక్షరాలు ముత్యాలకోవవలె నున్నవని సంతోషించి ప్రభువులు బహుమాన మిచ్చినారు.

రామ : (నవ్వి) అబద్ధమాడుటకూడ చేతకావలెనురా! నాలుగక్షరములు కుదిరికగా వ్రాసినంతనే మెచ్చి బహుమాన మిచ్చునంతటి వెఱ్ఱి ప్రభువులఁటరా రాయలవారు?

తిమ్మ : (భయసంకోచములతో) మఱేమిలేదు. (చేతులు నలుపును)

రామ : భయములేదులే! చెప్పుము. ఎవరితో చెప్పనులే!

తిమ్మ : మఱేమిలేదు. వారు పద్యములో మూఁడుపాదములు చెప్పి ఆలోచించుచుండఁగా నాలుగవపాదములో నాలుగు మాటలు నే నందించితిని. అంతే!

రామ : ఓహో! అదియా సంగతి! సమస్యాపూరణము చేసితి వన్నమాట!

తిమ్మ : అమ్మ బాబో! సమస్యలే! అంతంత పనులు నా వలన నేమగును బాబయ్యా! ఆ నాలుగుమాటలు చెప్పుటకూడ వారిచలువే! నా దేమున్నది! పామరుఁడను. వారు సాక్షాత్తు భోజమహారాజులే! ఈ మాటయే ప్రభువులకును మనవిచేసితిని కాకున్నచో నాకేమిటి! - కవిత్వమేమిటి!

రామ : (చకితుఁడై) ఓరి! తిమ్మప్పా! నీవు సామాన్యుఁడవు కావురా! రాయలవారికే బిరుద మిచ్చితివే!

తిమ్మ : (నివ్వెఱపడి, బిరుదా! నేనా!

రామ : అవునురా! ఆయనను భోజుఁడని కదా ప్రశంసించితివి. అనఁగా ఆంధ్ర భోజుఁడన్న మాట.

తిమ్మ : (సంతోషముతో) బలే కుదిరినది బాబయ్యా బలే కుదిరినది.

రామ : సరే! ఆ పద్యము చదువుము. ఆ పుస్తకమేమి!

తిమ్మ : (వినినట్లభినయించుచు, కుర్చీలు సర్దుచు) నామతి మండిపోను! తమ రిందాఁకటినుండి నిల్చుండియే యున్నారు. కూర్చుండుఁడు. బాబయ్యా! ఇంతకు తమ రెందుకు వచ్చినారో సెలవీయ లేదే!

రామ : (కూర్చుండి) మరేమిలేదు! మహామంత్రులవారు దక్షిణ జైత్రయాత్రకు రేపే ముహూర్తము బాగున్నదని రాయలవారిని తగుసన్నాహముతో నుండుఁడని, ఆ ఏర్పాటులు చేయుచున్న కారణముగా తాము సాయంకాల గోష్ఠికి రాజాలమని ఏలినవారికి మనవి చేయు మన్నారు.

తిమ్మ : చిత్రము. రేపేనా జైత్రయాత్ర! ప్రభువు లిప్పుడే వెళ్ళి విశ్రాంతి తీసికొనుచున్నారు. తమరుపోయి వారిని చూచిన సరే! లేకున్న నేనే వారికి తరువాత మనవి చేయుదును.

రామ : నీవేమి తక్కువవాఁడవా! నీవే చెప్పుము. తిమ్మ రుసుగారికన్న రెండక్షరములే గదరా తక్కువ నీకు!

తిమ్మ : అమ్మ బాబో! బుద్ధి! బుద్ధి! అపచారము! అపచారము! (చెంపలు వేసికొని) వారెక్కడ? నేనెక్కడ! బాబయ్యా నన్నిట్లు బ్రతుకనిండు.

రామ : సరేలే! ఇంతకును ఆ పద్య మేదీ! ఆ గ్రంథమేమి!

తిమ్మ : క్షమించవలె! పుస్తకము పూర్తి కానిదే అందులో పద్యాలు ఎవరికిని వినిపించవద్దని ప్రభువులయాజ్ఞ.

రామ : (నవ్వుచు) ఓహో! అటులనా! సరే! ఇటీవల నీవు పెద్దన్నగారి యొద్ద ఒకపద్యము చదివి అర్థమడిగితి వఁట గదా! ఆ పద్య మెక్కడిది?

తిమ్మ : (భయముతో) ఏ పద్యము బాబయ్యా!

రామ : అంత భయ మెందుకురా! "ఆనిష్టానిధిగేహసీమ" అని మొదలగు పద్యము కదా!

తిమ్మ : (నిర్వేదముతో) ఇది తమరిదాఁకను వచ్చినదా!

రామ : వచ్చినచో నేమిరా! అట్లు భయపడెద వేమి! దాని సంగతి పోనిమ్ము. నీవు పద్యమును పూరించి బిరుదము నొసంగి మహారాజుగారిచే బహుమానము నందితివిగదా! నిన్నభినందించుచు ఒకపద్యమైన చెప్పకున్న నెట్లు!

తిమ్మ : (భయముతో) అయ్యా! తమపాదాలకు మ్రొక్కుదును. నన్ను క్షమింపుఁడు. తమరు పద్యము చెప్పినచో

నింక వీధులలో తిరుగు యోగము కూడ ఉండదు. ఏదో తమపాదాల దగ్గర బ్రతుకువాఁడను. కనికరింపుఁడు బాబయ్యా!

రామ : (నవ్వుచు) నేను చెప్పినచో వికటముగా నుండు ననియా నీభయము! కానిమ్ము. పెద్దన్నగారు మొదలుగా నలుగురిచే నాల్గుపాదాలు చెప్పించుకొనుము.

తిమ్మ : ద్వారము దగ్గర పడియుండువానికి నాకెందుకు బాబయ్యా! పద్యాలు.

రామ : ఫరవాలేదు. నీ కెందుకు నేను చెప్పినట్లు చేయుము. నీపేరు చిరస్థాయిగా నుండఁగలదు!

తిమ్మ : చిత్తము. ఏదో అంతయు తమ దయ!
(ఇరువురు చెరియొక వైపుకు నిష్క్రమింతురు-తెర)

— —

# భువనవిజయము

## పంచమాంకము

(భువనవిజయములో సభాస్థానము. మధ్యలో రాజాసనము. రెండువైపుల బారులు దీర్చి, ఆరేసి కుర్చీలు వేయఁబడియుండును. ఒక ద్వారమునొద్ద తిమ్మప్ప, మరియొక ద్వారమునొద్ద ఇంకొకఁడు నుందురు. తెర నెత్తఁగనే ఒకఁడు కుర్చీలను సర్దుచుండును. తిమ్మప్ప శాలువ కప్పుకొని బెత్తమును కదిలించుచు తన్ను తాను చూచుకొనుచు సంతోషించుచుండును. రామకృష్ణుఁడు, పెద్దన్న మొదలుగ కవులు పుస్తకహస్తులై వానికెదురుగ మాటాడుకొనుచు మెల్లగ వచ్చుచుందురు)

రామ : తిమ్మప్ప మీదగ్గఱ చదివిన "అనిష్టానిధిగేహసీమ" అను పద్యము రాయలవారి గ్రంథము లోనిదేనా ?

పెద్దన్న : అయియుండునని కొందును.

రామ : విష్ణుదేవుఁడు కలలో కన్పించి తెలుఁగున కావ్యమును వ్రాయుమని ఆదేశించినట్లు మనకు వారు చెప్పియే యుండిరి కదా !

సూరన : వారు వ్రాయుచున్నది గోదాదేవికథ యను కొందును.

తిమ్మన్న : తక్కిన విష్ణుభక్తులకథలుకూడ రచించుచున్నారని వినికిడి. విష్ణుచిత్తుని కథ యానిన వారి కిష్టముకదా!

రామ : అట్లయినచో నది విష్ణుచిత్తీయమే.

పెద్దన్న : (నవ్వుచు) రామకృష్ణా! నీవు పుట్టని బిడ్డలకు పేర్లు పెట్టుచున్నావు.

రామ : రాయలవారు పుట్టియు పుట్టని కవిత్వమునకే బహుమానము లిచ్చుచుండఁగా నేను జరుగుచున్న గ్రంథమునకు పేరు పెట్టిన తప్పేమి? (ముందుకు చూచి) అదుగో! తిమ్మప్ప! ఆ పచ్చడమునే రాయలవారు బహూకరించినది. మనము వీనిని అభినందింపవలెను.

తిమ్మప్ప : (సంభ్రమముతో ముందుకువచ్చి) దండాలండి బాబయ్యా! దండాలు. (నమస్కరించును)

పెద్దన : శ్రేయః ప్రాప్తిరస్తు.

రామ : రాయలవారు పచ్చడముతో బహుమానింపగా మన మొక పద్యముతోనైన వీనిని బహూకరింపకుంటుట బాగుండదు.

పెద్దన : పద్యమా?

రామ : ఔను. మీరొక పాదము నారంభింపుఁడు, మేము పూరింతుము.

పెద్దన : (నవ్వుచు) సరే!

కం॥ వాకిటి కావలితిమ్మా! (ముందుకు నడచును)

తిమ్మన : (ముందుకువచ్చి)
పాక్రిటముగ సుకవివరుల పాలిటి సామ్మా!

సూరన : (ముందుకువచ్చి)
నీకిదె పద్యముఁ గొమ్మా!

రామ : (నవ్వుచు) నాకీ పచ్చడమెచాలు నయముగనిమ్మా
(చేయిచాఁచును) (చాటుపద్యరత్నాకరము పుట 17)

తిమ్మప్ప : (దిగ్భ్రాంతితో క్షణకాలముచూచి, పచ్చడము తీసియిచ్చి నమస్కరించును)

రామ : ఇతోఽధిక శ్రేయఃప్రాప్తిరస్తు.

తిమ్మప్ప : (వినయముతో, పై వంచలేదని భుజముల తడవు కొనుచు ప్రక్కలకుఁ జూచుచుండును)
(ధూర్జటి, అయ్యలరాజు రామభద్రుఁడు. మాదయ గారి మల్లన, భట్టుమూర్తి పుస్తకహస్తులై ఎదురు వైపుగ ప్రవేశింతురు.)

రామ : ఓరీ! ఇదిగో! నీకు ఉత్తరీయము. కప్పుకొనుము)
(ఇచ్చును)

తిమ్మ : చిత్తము. (తీసుకొని గబ గబా కప్పుకొనును)

పెద్ద : (కొంచెమాశ్చర్య కోపములతో) రామకృష్ణా ఏమిది?
వాని పచ్చడమును నీవు పరిగ్రహించుటేమి?
(దూరమునుండి శబ్దము. దౌవారికులు సంభ్రమముతో తమ తమ స్థానములకు పోయి నిలచియుందురు.)

పెద్ద : ప్రభువులు వచ్చుచున్నట్లున్నది. (ముందుకు పోవును)
(రాజాసనమునకు రెండువైపులనున్న ఒక్కొక్క యాసనమును తప్పించి కుడివైపున పైనుండి క్రింది వరుసగా పెద్దన, తిమ్మన, రామకృష్ణుఁడు, సూరన కూర్చుందురు. ఎడమవైపున వరుసగా ధూర్జటి, రామభద్రుఁడు, మల్లన్న, భట్టుమూర్తి యు కూర్చుందురు)
రెండువైపులను తుదియందు ఒక్కొక్క యాసనము ఖాళీగనుండును)

తిమ్మప్ప, దౌవారికుఁడు : రాజాధిరాజ! వీరప్రతాప! రాజపరమేశ్వర! మూరురాయరగండ! కృష్ణరాయక్షితీంద్ర! బహుపరాక్! బహుపరాక్!
(రాయలు ప్రవేశించి సింహాసనమువైపు పోవుచుండును. కవులందఱు లేచి నిలుచుందురు.)

రామకృ : సాహితీ సమరాంగణ సార్వభౌమ! ఆంధ్రభోజా విజయోఽస్తు.
(రాయలు కూర్చుండిన పిదప అందఱును కూర్చుందురు)

రాయ : (నవ్వుచు) రామకృష్ణా! ఈ కైవార మెప్పుడు నేర్చితివి?

భట్టు : (లేచి పరిహాసముతో) వస్త్రడము కొఱకు భటుల పైఁగూడ పద్యములు చెప్పగలపండితకవిప్రభువులకు

కై వారమును గూర్చుటలో నాశ్చర్యమేమున్నది ?
(కూర్చుండును)

రాయ : (చకితుఁడై ! పచ్చడమును గుర్తించుచు తిమ్మప్పా!

తిమ్మ : (భయముతో వణఁకుచు వచ్చును)

రాయ : ఏదీ నీ కిచ్చిన పచ్చడము ?

తిమ్మ : ఏలినవారు కనికరింపవలెను. (రామకృష్ణునివంక చూచును)

రాయ : (నవ్వుచు) రామకృష్ణకవీ ! నీకు పచ్చడములే కలవయ్యెనా ?

భట్టు : (లేచి, పరిహాసముతో) తిమ్మప్ప యిచ్చినను బహూకృతి, బహూకృతియే గదా ! అని స్వీకరించెను.

రామకృ : (లేచి, మండిపడి) ఓయీ ! అధిక ప్రసంగి !

చం॥ తెలియనివన్ని తప్పులని దిట్టతనాన సభాంత
రంబునన్ బలుకకు మోరి భట్టు.........

రాయ : (ఇంచుక కోపముతో) చేసినపని చాలక అతనిపై నాగ్రహింతువేమి ? చెప్పుము. ఎందుకిట్లు చేసితివి ?

రామకృ : (వినయముతో) దానిని వారు ధరించుట యుచితము కాదని.

రాయ : (విస్మయముతో) ఎట్లు ? ఇది యుచితముకాదా !

(కోపించి) మాకు పాత్రాపాత్ర వివేకము లేదని మీ యభిప్రాయము !

భట్టు: ప్రభువుల యుచితజ్ఞతనే శంకింతువా, ఇది క్షంతవ్యము కాదు ప్రభూ !

పెద్ద: (లేచి) ప్రభూ ! శాంతింపుడు : భట్టుమూర్తీ ! నీ కేల యీ యధిక ప్రసంగము ! నీకున్న ప్రభుభక్తి మా కెవ్వరకును లేదా ? ప్రభువనుగుచుండఁగా మధ్యలో నీ వేల సమిధలు వేసెదవు ! కూర్చుందుము. (భట్టుమూర్తి కూర్చుండును) రామకృష్ణా! నీ యభిప్రాయమేమో స్పష్టముగా వివరింపుము. (కూర్చుండును.)

రామకృ: (నవ్వుచు నెమ్మదిగ) ప్రభూ ! ప్రశాంతచిత్తులై యవధరింపుఁడు. తమ సాన్నిధ్యమున తిమ్మప్పకు కూడ కవిత్వము పుట్టినచో తమ రపర భోజులే కదా ! అందుచే ఇది తమకు జన్మోత్సవదినము. ఈ శుభసమయమున ప్రభువులను (ఆంధ్రభోజులను) నూతన బిరుదముతో నాశీర్వదించితిని. ఇది కైవారమగునా ?

తిమ్మ: నీ బుద్ధికుశలత యనుపమాన మోయీ !

భట్టు: మఱి పచ్చడమును హరించుటలో పరమార్థమేమో!

సూరన: భట్టూ ! అతఁడు చెప్పునదేమో పూర్తిగా వినరాదా ? నీ వెందుల కాతనిపై నోంటికాలిపై లేచెదవు ?

రామకృ : (పరిహాసముతో) ఎందులకా ? బోర పడుటకు! ప్రభూ ! ఇంక తిమ్మన్న విషయమును పరిశీలింపుడు. వాఁడు రసజ్ఞుఁడు కావచ్చును. కవిత్వమును చెప్ప వచ్చును వానిని కవిగనో, రసజ్ఞునిగనో మనము సమ్మానింపఁ దలఁచినచో అచ్చట (భట్టుమూర్తి వైపు చూపి) ఆతని ప్రక్కన కూర్చుండఁబెట్టి, పచ్చ డమును కప్పుట న్యాయము.

భట్టు : (ఉగ్రుఁడై) ఏమీ ! (లేచును పెద్దనాదులు సైగ చేయఁగా కూర్చుండును.)

రామకృ : అట్లుగాక పండితయోగ్యమైన పచ్చడమును కప్పి వానిని దౌవారికునిగనే వాకిట నుంచినచో, ఈ మహాసభకు ఆగంతుకులుగా వచ్చు సామంతులు, పండితులు, కవులు వానిని జూచి ఏమనుకొందురు ?

మల్లన : ఔను. ఇది ఆలోచింప వలసినదే ! (రాయలు రామకృష్ణునివైపు ఏకాగ్రముగ చూచు చుండును.)

రామకృ : ఒక పండితుని తామిట్టి నీచకృత్యమున నియ మించి యవమానించు చున్నారనియే కదా వారు తలంతురు. మనము ఎంతమంది యొద్దకుపోయి, "వాఁడసలు దౌవారికుఁడే! ఐనను ప్రభువులు మెచ్చి, వానికి పచ్చడము నిచ్చినారంతే! మఱేమియును లేదు" అని చెప్పుచుండఁగలము ? అట్లు తమకీర్తికి

కొంతఱత కలుగకుండ వలయుననియే నే నీ పరిగ్రహ
మునకు పాల్పడితిని ప్రభూ !

రాయ : (తలయూఁచి) నీవు చెప్పినది సమంజసముగనే
యున్నది.

రామకృ : పచ్చడమునకే పాలుమాలితినని ఈ భట్టు
మూర్తి వదరుచుండెను గదా! గమనింపుఁడు
ప్రభూ! నేను వానికిచ్చిన పట్టుప్రావారకమే పచ్చ
డము కన్న విలువ కలది. పచ్చడము కొద్దిదైనను
పండితులకే యోగ్యము. పట్టువస్త్రములు సంపన్ను
లెవ్వరైనను ధరింపవచ్చును.

సూరన : రామకృష్ణుల వారి లోకజ్ఞత యనుపమానము.

రామకృ : భట్టుమూర్తి పామరత్వమును అసదృశమే!
భట్టూ ! ఇప్పుడేమందువు ?

చం॥ తెలియనివన్ని తప్పులని దిట్టతనాన సభాంత
రంబునన్ బలుకకు... ... ...

భట్టు : (సంభ్రమముతో లేచి నమస్కరించుచు, రామకృష్ణ
కవీ ! క్షమింపుము. క్షమింపుము.

సూరన : (నవ్వుచు) దాసుని తప్పు దండముతో సరి.

రాయ : (చిరునవ్వుతో) రామకృష్ణకవీ! శాంతింపుము. నీవు
తిట్టినచో వానికది శాశ్వతముగ ముద్రపడును.
వానితో నేమి ? బాలుఁడు కదా !

పెద్దన : శుభసమయమున కలంత లెందులకు ? ఇంక దానిని పోనిమ్ము.

రాయ : సరే ! మఱి తిమ్మప్పను మే మెట్లు సమ్మానించుట యుక్తమో నీవే చెప్పుము.

రామకృ : దానికేమున్నది! ప్రభూ ! సామంత రాజేంద్ర కిరీటమణి ప్రభాసీరాజితాంఘ్రులగు తమ సభా భవనమున అరివీరనృపాలురే ద్వారికులుగా నున్నారన్నచో నది తమ సార్వభౌమత్వమునకు యశః పతాక యగుటయేకాదు. అష్టదిగ్గజ విలాసభాసురంబైన యీ భువన విజయంబును సార్థకం బగును.

మల్ల : అది ఎట్లు ? అందఱును కుతూహలముతో చూచుచుందురు)

రామకృ : కలవు కదా జైత్రయాత్రాసమార్జితములైన వైరివీరరాజన్య భూషణములు ! వానిలో నొకటి వానికి ప్రసాదింపుడు. వాఁడు దానితో దాను సామంతుఁడైనట్లే సంతోషించును. వానిని బంటుగా పనిగొనుచున్న మేమును - ఏదో సాహిత్యమునకైనను చక్రవర్తుల మైనట్లు సంతోషింతుము.

రాయ : (సంతోషముతో) శభాష్ ! రామకృష్ణా ! చక్కఁగా చెప్పితివోయి.

(ప్రక్కకు చూచి) ఎవరక్కడ! ఆభరణముల తెమ్ము
(భటుఁడు ఒకపేటికను తెచ్చియిచ్చును.)

తిమ్మప్పా! ఇది కనకగిరి భూపాలుని కంఠహారము, ధరింపుము.

తిమ్మ : (హర్షముతో ముందుకువచ్చి) చిత్తము (స్వీకరించును)
(అందఱును హర్షధ్వానములు చేయుదురు.)

రాయ : రామకృష్ణా! నీ భావుకత్వ మమోఘమైనదోయీ! మే మెప్పటికథలనో కావ్యములుగా చేయుచుండఁగా నీవు ఎప్పటికప్పుడు నిత్యజీవితముననే నిరుపమాన కవిత్వమును పుట్టించుచున్నావు...... ఓహో! ఈ ప్రసంగమున అనుకున్న విషయమునే మఱచితిని.

పెద్దన : ఏమది ప్రభూ!

రాయ : ఈయుత్సవ గోష్ఠియందు సంస్కృతాంధ్రములలో సమానముగా కవిత్వము చెప్పఁగలవానికి గండపెండేరము నొసంగవలయు నని సంకల్పించితిని. మీరందఱును మహాకవులు. సమర్థులు. ఎవరైనను స్వీకరింపుఁడు (ప్రక్కకు చూచి) ఎవరక్కడ!

(ధూర్జటివైపునుండి అందఱును చూచుచుందురు. ఒక్కొక్కరును తలవంచుకొనుచు, తలగోకికొనుచు ఆలోచించుచుందురు. భట్టుమూర్తి అటునిటు కదలుచు, దిక్కులు చూచుచు, లేవనుంకించుచు నూరకుండును. రామకృష్ణుఁడు లేచి, సభనంతయు వరి

కించి, పెద్దనవైపు చూచి, కూర్చుండును. భటుఁడు గండ పెండేరమును పళ్ళెరములోనుంచి తెచ్చి సభా మధ్యమున చిన్నబల్లపై నుంచును)

రాయ : (విసుగుతో)

ఉ॥ ముద్దుగ గండపెండియరమున్ గొనుఁడంచు బహూకరింపగా । నొద్దిక నా కొసంగు మని యొక్కరుఁగోరఁగ లేదు; లేరొకో.

(చాటు పద్య మణిమంజరి. పుట 151)

(సభ నంతయు మరలఁ గలయఁ జూచును)

పెద్దన : (లేచి) "పెద్దనబోలు పండితులు పృథ్విని లేరని నీ వెఱుంగవే పెద్దన్నకే దలంచినను బేరిమి నాకిడు కృష్ణరాణ్ణృపా!" (చాటు పద్య మణిమంజరి. పుట 151)

వ్రిభూ ఈరోజులలో కవిత్వమునకు కొఱఁత యేమి? చల్లని తమ యేలుబడిలో నెల్లరును కవులే! ఒకఁడు కథ లల్లుచు నదియే ఘనమనుకొనుచుండఁగా, నింకొకఁడు అభూతకల్పనలతో నయఃపిండములనుగా పద్యగుల విసరుట కవీంద్రత్వమని గర్జించుచున్నాఁడు. ఒకఁడు రెండర్థములతో పద్యమును చెప్పఁగా, వానిని మించి మఱియొకఁడు మూఁడర్థములతో వ్రాయుచు తనకన్న మించినవాఁడు లేడని తనలో తానే మురియుచున్నాఁడు. కవిత్వమన్నచో నిదియా?

ఉత్పల మాలిక :

పూత మెఱుంగులుం బసరుపూపబెడంగులు ! జూపు
నట్టివా । కైతలు ! జగ్గునిగ్గు నెనగా వలె!; గమ్మన !
గమ్మన న్వలెన్; । రాతిరెయుం బవల్ మఱపురాని
పాటల్ చెలి యూరజంపుని। ద్దాతరి తీపులోయనగ
దాకసిలన్వలె లోఁదలంచినన్ 4

బాఁతిగఁ బైకొనన్వలెను, బైదలి కుత్తుకలోని పల్లటీ
కూఁతలనన్వలెన్ సొగసు కోర్కులు రావలె నాలకిం
చినన్; । చేణి కొలంది కౌఁగిటను జేర్చినఁగన్నియ
చిన్న పొన్నిమే । ల్మూఁతల చన్నుదోయివలె
ముచ్చట గావలెఁ బట్టి చూచినన్; 8

డాతొడ నున్న మిన్నుల మిటారపు ముద్దులగుమ్మ
కమ్మనా । వాతెఱ దొండపండువలె వాచవి గావలె
బంట నూదనన్; । గాతలఁ దమ్మిచూలి దొరకై
వసపుంజవరాలి సిబ్బెపు న్నెతెలి యుబ్బరంపు జగి
నిబ్బరవుబ్బగు గబ్బిగుబ్బ పొం 12

బూతల నున్నకాయునరి పొడిమి కిన్నర మెట్టుజీ
వం । గాతపు నన్నతంతి బయకారవుఁగన్నడ గా
పంతుకా సాతత తానతానలపనం దివుటాడెడు గోట
మీటుబల్ మ్రోఁతలునుం బలెన్ హారువు మొల్లము
గావలె; నచ్చతెన్గులీ 16

రీతిక; సంస్కృతంబుపచరించెనుపట్టున భారతీ వధూ
టీ తపనీయ గర్భనికటీ భవదాన నషగ్వ సాహితీ

భాతిక నాటకప్రకర భారతభారతీ సమ్మతప్రభా
శీతనగాత్మజా గిరిశశేఖర శీతమయూఖ రేఖికా 20
పాతసుధా ప్రపూత బహుభంగ ఘుమాఘుమ
ఘుంఘుమార్భటీ! జాతక తాళయుగ్మలయ సంగతి
చుంచు విపంచికా మృదంగ! గాతత తేహి తత్తహి
తహాధిత దంధణు ధాణుదింధిమి వ్రాతనయానుకూల
పరివారకుహూద్వహా హారికింకిణి 24

నూతన ఘల్ఘలా చరణ నూపుర ఝూళఝుళీ మరంద
సంఘాతవియద్ధునీ చకచకద్వికచోత్పల సారసంగ్రహా
యాత కుమారగంధవహహారి సుగంధ విలాస
యుక్తమై! చేతము చల్లఁజేయవలె; జిల్లన! జల్లవలె
న్మనోహర 28

ద్యోతక గోస్తనీఫలమధుద్రవ గోఘృత పాయస ప్రపా
రాతిరసప్రసార రుచిరప్రతిమంబుగ సారెసారెకున్ 30

(చాటు పద్య మణిమంజరి—పుట 151, 152, 153)

(ఎల్లరును హర్షధ్వానములు జేయుదురు. రాయలు సంతోషపారవశ్యమున సింహాసనమునుండి దిగివచ్చి గండపెండెరమును గైకొని)

రాయ : తే॥ ఆంధ్రకవితా పితామహా! యల్లసాని
పెద్దన కవీంద్ర! కొనుమిదే పెండెరమును.

(పెద్దన కాలికి తొడుగును,

పెద్దన : కృష్ణరాయక్షితీంద్ర ! విజయోఽస్తు. (రాయలు వెళ్ళి సింహాసనమున కూర్చుండును.)

మ॥ శరసంధాన బలక్షమాది వివిధైశ్వర్యంబులుంగల్గి
దుర్భర షండత్వ బిలప్రవేశకలన బ్రహ్మఘ్నతల్
మానినన్ । నరసింహక్షితి మండలేశ్వరుల నెన్నన్
వచ్చు నీ సాటిగా నరసింహక్షితి మండలేశ్వరుల
కృష్ణా ! రాజకంఠీరవా !

తిమ్మన : అహో ! ఏమిధార ! ఇది యపూర్వము. నిజముగా పెద్దనగారు ఆంధ్రకవితా పితామహులే !

ధూర్జటి : సందేహమేమున్నది ?

రా॥కృ॥ : లేకేమి ? కొంచెమున్నది.

ధూర్జటి : ఏమది ?

రా॥కృ॥ : తాతగారు గుహలో దూరుచున్నదని ముందు వర్ణించిన సింహమునే మరల తోకబట్టి పైకి లాగుచున్నారు.

ధూర్జటి : నిజమే. బిల ప్రవేశమను దోషముచేత ప్రభువులతో పోల్చుటకు అర్హముకాదని నిరాకరించిన సింహమును, మరల "రాజకంఠీరవా !" అని సంబోధనలో ఉపమానకోటికి తెచ్చుట ఉచితముగా లేదు.

తిమ్మన : (రామకృష్ణునితో) సరే ! నీవు చెప్పుము ఎట్లుండునో చూతము.

రా॥ కృ : ఇదిగో వినుఁడుఁ

మ॥ కలనందావక ఖడ్గఖండిత రిపుక్ష్మాభర్త మార్తాండ
మం। డల భేదం బొనరించి యేఁగునెడఁ దన్మ
ధ్యంబునన్ హార కుం। డల కేయూర కిరీట
భూషితుని శ్రీనారాయణుం గాంచి లోఁ॥ గలఁ
బాఱుచు నేను నీవ యనుశంకన్ గృష్ణరాయాధిపా!

తిమ్మన : (సంతోషముతో) చక్కఁగా చెప్పితివోయి.

భట్టు : అప్పటి కాశుకవిత్వమే యగ్రగణ్య మన్నమాట.

సూర : అదేమి ? అట్లందువు ! ఆశువైనను అందు పొల్లుపద
మొక్కటి కలదా ? కవిత్వమునకు లక్షణమును లక్ష్య
మును ఒక్కమాలికయందే కూర్చిరిగదా పెద్దనగారు!

మల్ల : కావ్యరచనమునందైనను మనుచరిత్రమును మించు
కావ్యము కలదా !

భట్టు : తక్కినవానితో పోల్చి తూకము వేసినవారెవరు ?
వేయఁగల వారెవరు ? "గతానుగతికో లోకః"

రామకృ : (నవ్వుచు) భట్టూ ! నీ వసుచరిత్రము తక్కువ
దనియెవ రన్నారు ? ఏలయింతయుడికెదవు ? మే
మందఱమును కావ్యకర్తలము కామా ? ప్రభువులును
మహాకావ్యనిర్మాణనిపుణులే కదా ! ఎవరికిని లేని
యీ మాత్సర్యము పెద్దనగారియెడల నీకేలనోయీ!

భట్టు : ఇందు మాత్సర్యమున కేమున్నది ? పదిమంది
మెచ్చిన కవిత్వమునకు పల్లకీలు పట్టువారే కాని కవిత్వ

పరిపాకమును గుర్తించి నిష్పాక్షికముగ తారతమ్య
మును నిర్ణయింపఁగల వారెవ్వరనియే నా యారా
టము.

రాయ : (కోపముతో) ఇందు గుణజ్ఞులగు విద్వాంసులు
లేరనియేనా నీ యభిప్రాయము?

రామకృ : ప్రభూ! పిచ్చుకపై బ్రహ్మాస్త్ర మేల? భట్టూ!
ఏమందువు? కవిత్వ తారతమ్యమును నిర్ణయింపఁ
గలవారే లేరనికదా నీవనినది! ఇదిగో! నేనున్నాఁ
డను, చెప్పుమందువా?

రామభ : భేష్! చెప్పుము అందుకు నీవే తగుదువోయీ!

రామకృ : ప్రభూ! ఈతని గ్రంథమును మఱిరెండు గ్రంథ
ములతోఁ బోల్చినఁ జాలును. సమానఘట్టములను
గదా పోల్చవలయును. మొదటఁబుట్టినది మనుచరి
త్రము. అందు వరూధినీవిలాపమును గమనింపుఁడు.

ఉ॥ పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక! నీవు
త్రోవ నిచ్చోట భవన్నఖాంకురము సోఁకెఁ
గనుంగొను మంచుఁ జూపియు ప్పాటలగంధి వేద
న నెపంబిడి యేడ్చెఁగలస్వనంబుతో మీటిన
విచ్చు గుబ్బచనుమిట్టల నశ్రులు చిందువందఁగన్
(మనుచరిత్రము 2 అశ్వా ప. 70)

ఏడ్పుట ఎప్పుడైనను కలస్వనముతో నుండునా?
సందేహమే. నిజముగా నొప్పిగల్గినచో అప్పటిఏడ్పు

వినుటకు దుర్భరమే. కాని వరూధిని ఏడ్చుచున్నటు నటించుచున్నది. నిజముగా ఏడ్చుటలేదు ఏడ్పుచేత నైన అతనిని ఆకర్షింపవలయు ననియే ఆమె ప్రయత్నము. ఇంత అనుకొన్నను, ఏడ్పు కలస్వనముతో నుండునాయను సందేహము పూర్తిగాతీరదు. ఎట్లయి నను గంధర్వస్త్రీ కదా! అందును నెపముపెట్టి ఏడ్చుచున్నది. కావున ఆమె ఏడ్పు కలస్వనముతో నుంటిన నుండవచ్చును.

ఇంక సత్యభామా విలాపమును వినుఁడు.

ఉ॥ ఈసునఁబుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచే । గాసిలి యేడ్చెఁ బ్రాణవిభుకట్టెదుటన్ లలితాంగి పంకజ । శ్రీసఖమైన మోముపయిఁ జేలచెఱంగిడి బాలపల్లవ । గ్రాసకషాయ కంఠ కలకంఠ వధూకల కాకలీ ధ్వనిన్.

(పారిజాతాపహరణము - 1 ఆశ్వా - ప. 133)

ఈమె వరూధినికిపైన రెండాకు లెక్కువ చదివినది. శోకదవానలముచే గాసిలినను సత్యాదేః కంఠము కొంచెముకూడ శ్రుతితప్పక స్థాయితగ్గక, కాకలీధ్వని లోనే సాగినది. ఇదియేమి వింతయో తెలియదు. మన యిండ్లలో నాడువారికి మాటకు మాట పెరిగిన నేచాలు మఱుక్షణమే ముఖము భీకరమై, కంఠము కఠోరమై మనకు ఇంట కాల్నిల్పుటయే కష్టమగు

చున్నది. ఆహా! ఆ కృష్ణుని భాగ్యమే భాగ్యము కదా!

అయ్యా! ఇంక గిరికారోదనమును చిత్తగింపుఁడు.

శా॥ ఆ జాబిల్లి వెలుంగువెల్లికల డాయన్ లేక
రాకానిశా రాజశ్రీసఖమైన మోమునఁ బటాం
గ్రం బొత్తి యెలుగెత్తి యా। రాజీవానన యేడ్చెఁ
గిన్నర వధూరాజ త్కరాంభోజకాం । భోజీమేళ
విపంచి కారవ సుధాపూరంబు తోరంబుగన్

(వసుచరిత్ర చతుర్థాశ్వాసము 52 వద్యము)

గిరికాదేవి వెన్నెలవెల్లికలను డాయలేకున్నదట! అన లామె నక్కడకు పొమ్మని ఎవరు త్రోసిరి?

భట్టు : ఇదియేమి విమర్శ?

రామకృ : నేను చెప్పునది విని, సమాధానమున్నచో తరువాతఁ చెప్పుము. అయ్యా! వెన్నెలకు వెఱచి ఎలుగెత్తి ఏడ్చువారును నుందురా?

ధూర్జటి : లేరని నీవెట్లు చెప్పఁగలవు? కొందఱుండవచ్చును

రామకృ : ఔనౌను. ఉన్మత్తు లట్లుండవచ్చును.

ధూర్జటి : ఉన్మత్తులేమి? సుకుమారప్రకృతులట్లుందురు. నీకేమి తెలియును?

రామకృ : (పరిహాసముతో) చిత్తము. చిత్తము తమ యనుభవము మా కెక్కడిది? ఆ సౌకుమార్యము చేతనే

కాబోలు, ఎలుగెత్తి పడ్చినను కాంభోజీ మేళమున కచేరీ చేసికొట్టియున్నది కచేరీమాత్రమేనా? సుధాపూరమే పొర్లి పొర్లి వచ్చుచున్నదికదా! అది ఏమున? అయ్యా! గమనించితిరా? ఇందు "నేను 'సంగీత కళారహస్య నిధి'ని నన్ను గుర్తింపుడని" భట్టుమూర్తిగారి ఏడుపేగాని గిరిక ఏమి పెక్కడిది? ఇదియు నొక రచనయేనా?

తిమ్మన : రామకృష్ణా! నీ విమర్శ కడుసమంజసము.

ధూర్జటి : ఇది సమంజసమా? అట్లయినచో ఈతనికి నచ్చునట్లుగ కవిత్వము చెప్పువారు పృథ్విలో నుండరు.

రామకృ : లేకేమి? పృథ్విలోనే కలరు.

మల్లన : ఎవరా భాగ్యశాలులు?

రామకృ : క॥ కవి యల్లసాని పెద్దన (అందఱును సంతోషముతో పెద్దనవైపు చూతురు.)

కవి తిక్కన సోమయాజిగణుతింపంగా

ధూర్జటి : ఎట్లెట్లు? తిక్కనయు పెద్దనకు తరువాతివాఁడేనా?

సూరన : ఇరువురును కవిబ్రహ్మలే. అయినను పెద్దనగారి పద్యమున తీపి హెచ్చుకదా! అనువాదము కాకుండ స్వతంత్రముగ తెలుఁగుకావ్యమును రచించి అందు తియ్యనిపోకడలను మొదట చూపినదివారే కదా! ప్రభువులు వారిని ఆంధ్ర కవితాపితామహులని

యూరకయే ప్రశంసించి నారా ? (రాయలు సబహు మానముగా పెద్దనవంక జూచును)

భట్టు : సరి. సరి. ఇంతకును మూఁడవభాగ్యశాలి ఎవఁడు ?

రామకృ : (నవ్వుచు) కవి నేను రామకృష్ణుఁడ

భట్టు : తిక్కన తరువాత నీవేనా కవివి ?

మల్లన : అట్లయినచో గండ పెండెరమునకై లేచినిల్చుం డియు మరలఁ గూర్చుంటి వేల ?

రామకృ : ఆ పెద్దరికము వారికే దక్కవలయు నని.

భట్టు : ఓహో ! అటులనా ? కానిమ్ము. (ధూర్జటి మొదలగు వారివైపు చూచి) వీరెవరును నీ దృష్టికి కవులుగా కన్పించుట లేదా ?

రామకృ : అయ్యో ! మీ అందఱును కవులు కాకపోవుట యేమి ?

కవియను నామంబు నీటికాకికి లేదే ?"

(చాటుపద్య రత్నాకరము - పుట. 16)

(ధూర్జటి ప్రభృతులు కోపమును ప్రకటించుచుం డఁగా పెద్దనాదులు చిఱునవ్వుతో చూచుచుందురు)

భట్టు : ఏమి యీ పొగరుఁబోతుతనము ! (తలపంకించి) సరే ! ప్రభువుల కవిత్వమును నీకు నచ్చలేదా ?

పెద్దన : తెలుఁగు కవిత్వమునుగూర్చి మాటాడుచుండఁగా, ప్రభువుల కవిత్వమున కిందు ప్రసక్తి ఏమున్నది ? వా రింతవఱకు సంస్కృతమున నేకదా రచించినది !

రామభ : దానికేమి? కవిత్వమునకు భాషాభేద మేమున్నది?

మల్లన : ఔను. మనము భవభూతి కాళిదాసాదుల కావ్యము లందును గుణదోషముల పరిశీలించుచు తారతమ్య ముల నెన్నుచునే యున్నాము కదా !

తిమ్మన : (రాయలతో) తాము విష్ణుదేవుని యాదేశమున తెలుఁగున రచించుచున్న కావ్య మెంతవరకు వచ్చి నది ? ఈ యుత్సవమున, ఆ కావ్యపఠనమే గోష్ఠిగాఁ జేసియున్నచో బాగుండెడిది.

రాయలు : అది యింకను పూర్తికాలేదు. అసంపూర్ణ కృతి నావిష్కరించుట ఏ కళాశిల్పమున నైన సమంజసము కాదుకదా ! వచ్చుచున్న వసంతోత్సవములలో దానిపైననే గోష్ఠి చేయుదము.

తిమ్మన : చిత్తము.

భట్టు : ప్రభువుల పేరు చెప్పగనే రామకృష్ణకవికి వాగ్బంధ మైనట్లున్నదే !

రాయలు : కవిత్వగోష్ఠిలో ప్రభుత్వమున కేమి సంబంధము? ఇచ్చట నేనును కవినే. భట్టువారి చెప్పిన మాట నిజము. "సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్ ?" దిక్కా లాద్యనవిచ్ఛిన్నముగా ప్రజా హృదయముల నేలఁ గల కాళిదాసాది మహాకవుల ప్రాభవమే ప్రాభవము కదా ! ఒక యూరి కరణము మరియొక యూరికి వెట్టి యన్నట్లు ఈ రాజుల యధికార మెంత ?

రామకృ : ప్రభూ ! తమ సామ్రాజ్యమువలెనే హృదయ మును కడుంగడు విశాలము.

రాయలు : (నవ్వి) కావుననే మా కవిత్వమునుగూర్చి కూడ నిస్సంకోచముగఁ జెప్పుము నీకు భయమేమి ? మాకును కుతూహలము కలదు.

రామకృ : ప్రభూ ! తమ హృదయ వైశాల్యము నాకుఁ దెలియనిదా ? తమ పాండిత్య ప్రతిభలును అత్యంత గంభీరములు. ప్రౌఢిమయందు తమరు మురారికి ముత్తాతలే. కల్పనములందు భట్టబాణు నకు బావమఱఁదులే.

రాయలు : సరే ! రస భావముల సంగతి చెప్పవైతివే !

రామకృ : చెప్పవలసిన దేమున్నది ? "కూడు లేదు ; కూర లేదు! ఉన్నవానికి కేఁడి లేదు; కృపతో భుజింపుఁడు" అన్నట్లుండును తమ కవిత్వము.

(అందఱును చకితులగుదురు)

ధూర్జటి : అదేమి అట్లంటివి ? ఏమి నీ యభిప్రాయము ?

రామకృ : అయ్యా ! చిత్తగింపుఁడు. ప్రభువులు విష్ణుచిత్తు నిచే నతిథులకు ఇట్టి యాతిథ్యమును చేయించు చున్నారు.

రాయలు : ఓహో! ఇది నీ దాఁక వచ్చినదా ? మంచిదే! కానిమ్ము.

రామకృ : చిత్తగింపుఁడు.

శా॥ ఆ సిద్ధానిధి గేహసీమ నడురే యాలించినన్
మోగ్రియు నెం। తే నాగేంద్రశయాను పుణ్యకథలుం
దివ్యప్రబంధాను సం। ధానద్యానము "నాస్తిశాక
బహుతా, నాస్త్యుష్ణతా, నాస్త్య ఘృ।పో నాస్త్యో
దన సౌష్ఠవం చ కృపయా భోక్తవ్య" మన్మా
టలున్.

అయ్యా! విన్నారు కదా! ఆ మహాభక్తుఁడు అర్ధ రాత్రియైనను తాను నిద్రింపకుండుటయేకాక పొరుగింటివారిని కూడ నిద్రపోనిచ్చుటలేదు. పుణ్యకథలతో జాగారముచేయుట కిది ఏకాదశీ వ్రతముకొనుచున్నారేమో, కాదు, కాదు. అట్లయినచో భోజనములకు ప్రసక్తి యెక్కడిది? ఇది నిత్యవ్రతమే.

రాయలు : (నవ్వుచు) ఏదీ పొరుగువారికి నిద్రాభంగము కల్గించుటేనా ?

రామకృ : చిత్తము. చిత్తము. అంతమాత్రమేనా! అతిథిసత్కారము కూడ అట్టిదే. కూరలా ఎక్కువగ లేవు. ఉన్నవానికా వెచ్చదనము లేదు. అప్పము లసలేలేవు అన్నమా సంకటిగనో నను ప్రాయిగనో యున్నది.

ధూర్జటి : ఈ మాట లన్నియు నా మహాభక్తుఁడు చెప్పు నుపచార వాక్యములే కదా! తప్పేమి?

రామకృ హరిహరీ! అట్టి మహాభక్తునియందు తప్పు లెన్నుదునా? అపచార మపచారము. పాపము శమించును గాక! (చెంపలు వేసికొనును)

భట్టు: ఈ పిల్లి శపథము లెందుకయ్యా! చెప్పఁదలఁచిన దేదో సూటిగా చెప్పుము.

రామకృ: నీవలె కల్లబొల్లి మాటలలో తియ్యని కల్పనలు చేయుట మా చేతనగునా! నేను సూటిగనే చెప్పుచున్నాను అర్ధరాత్రివఱకు భజనలు చేసి చేసి ఆకలితో అసురుసురై అలమటించుచున్న యా యతిథుల కీ యుపచార వాక్యములు చెవినిబడినచో పై ప్రాణములు పైననే పోకయుండునా యని నా సంశయము.

రాయలు: (నవ్వుచు) మంచి సంశయమే!

భట్టు: [సభనుకలయఁ జూచుచు] అయ్యా! చూచితిరా ఈతని పొగరుఁబోతుదనము! ప్రభువు లిచ్చిన చనువుచే ఈతఁడిట్లు మాటాడుచున్నాఁడు.

రాయలు: భట్టుమూర్తీ! ఇందు తప్పేమున్నది? అతఁడు తన యభిప్రాయమును చెప్పినాఁడు. ఇతరులను బలవంత పెట్టి మన కవిత్వమును వారు మెచ్చునట్లు చేయలేము కదా! ఒక్కొక్కనికి ఒక్కొక్క కవిత్వము నచ్చును; మఱియొకనిది నచ్చదు. దానికేమి?

భట్టు: ప్రభూ! మన రచనముల సంగతి పోనిండు. కాళ

హా స్త్రీశ్వర మాహాత్మ్య మీతని గ్రంథములకుఁ
దీసిపోవునదా ? వారి కవిత్వమెంత మనోజ్ఞమైనది?

రాయలు : నిజమే. నేనును వారి కవిత్వమును చదువు
నప్పుడు...

చం॥ స్తుతమతియైన యాంధ్రకవిధూర్జటి పల్కుల
కేల కల్గెనో యతులిత మాధురీమహిమ......
అని చకితుఁడ నగుచుందును.

మల్లన : ప్రభూ ! నేనును అట్లే అనుకొనుచుందును.

తిమ్మన : ఆయనను చూచినచో నంతటివాఁడని ఎవ్వరును
గుర్తింపఁజాలరు.

రామకృ : [సావధానముగ] నేనును అట్లే అనుకొనుచుంటిని.

భట్టు : ఎట్లు ! మీరును ఇట్లే అనుకొనుచున్నారా !

రామకృ : చాల కాలముగ నా విషయమునే పరిశీలించు
చుంటిని కూడ. ఆ మాధురీ మహిమకు హేతువు
కూడ తెలిసినది.

తిమ్మన : చెప్పుము. సంశయించెద వేల ?

రామకృ : అది విచారకరముగ నుండి నే చెప్పకుంటిని.

మల్లన : ఏమి ? విచారకరమా ? ఎందువలన ?

రామకృ : మరేమియును లేదు మన కందఱకును అట్టి అవ
కాశములు లేవే యని.

రాయలు : దానికేమిలే! ఎవరి సుకృతము వారిది. చెప్పుము.

రామకృ : [గంభీరముగ] ...... హా! తెలిసెన్ భువనైక మోహనోద్ధత సుకుమార వారవనితా జనతా ఘనతాపహారి సంతత మధురాధరోదిత సుధారస ధారలఁ గ్రోలుటం జుమీ!

[చాటు పద్యమణిమంజరి—పుట, 154]

[పెద్దన ప్రభృతులు నవ్వు నాపుకొనుచు పెదవులు బిగింతురు. ధూర్జటి సిగ్గుతో తలవంచుకొనును]

భట్టు : [కోపముతో] చూచితిరా ప్రభూ! మీ రిచ్చిన చనువిది. ఎంతవారి నెట్లవమానించు చున్నాఁడో చూడుఁడు.

రాయలు : [దరహాసముతో కూడినకోపముతో] రామకృష్ణ కవీ! ఏమది? పెద్దల నిట్లవమానింపవచ్చునా?

రామకృ : [వినయముతో] ప్రభూ! క్షమింపుఁడు [ధూర్జటితో] మహాకవీ! మన్నింపుము. కవుల రసికత్వము నకు కావ్య సరసత్వమునకు గల సంబంధమును నిరూపించుటయే నా యభిప్రాయము. హరి హరీ! అంతవారి నవమానింతునా!

రాయలు : [నవ్వుచు] సరే! ఇది నీకెట్లు తెలిసినది?

రామకృ : దానికేమున్నది ప్రభూ ! రవి కాంచనిచోఁ గవి కాంచునే గదా !

భట్టు : [పరిహాసముతో] నిజము. నిజము. రవి గానిచోఁ గవి గాంచునే కదా !

రాయలు : (చకితుఁడై నీవేమో సమస్యను పూరించువాని వలె నున్నావు !

భట్టు : ప్రభువు లనుజ్ఞ ఇచ్చినచో పూరింతును.

రాయలు : దానికేమి ! పూరింపుము.

భట్టు : ఉ॥ ఆరవి వీరభద్రు చరణాహతి డుల్లిన బోసినోటి
కిన్ ॥ నేరఁడు, రామకృష్ణకవి నేరిచెఁబో మన
ముక్కు తిమ్మరాట్ । క్రూర వదాహతిం దెగిన
కొక్కిరిపంటికి దుప్పికొమ్ము ప
ల్గారచియుంచె? నౌర; రవి గానిచోఁ గవి
గాంచునేకదా !

చాటుపద్య మణిమంజరి. (144)

(అందఱును హర్షధ్వానములు చేయుదురు.)

రాయలు : (కుతూహలముతో) ఇందేదో కథ యున్నట్లున్నదే !

భట్టు : ఏమున్నది. రామకృష్ణుని కొంటెతనమున కిది ఫలము ప్రభూ! మొన్న తిమ్మనగారు రాయలబల్లపైఁ గూర్చుండి యూగుచుండఁగా నీతఁడు పోయి

'తాతా! యూఁతునా!' యనెను. వారు మంచి దక్లే కానిస్మనిరి అంత సీతఁడు వెంటనే వారిపై నుమిసి తన్నులు తిని పన్ను పోఁగా దుప్పికొమ్ము తగిలించు కొనెను

పెద్దన : భట్టుమూర్తీ! గోరంతలు కొండంతలుఁగా నుత్ప్రేక్షింతు వేల? ప్రభూ! రామకృష్ణుఁడూయల నూఁచుటకు ముందుకు పోయిన మాట నిజమే. ఒకసారి యూఁచిన పిమ్మట నెవరో పిలువఁగా ప్రక్కకు మరలి యూయల సంగతి మఱచెను. ఇంతలో పైనుండి యూపున వచ్చుచున్న యూయల తగిలి పన్నూడెను. అంతే!

రాయ : ఓహో! ఇదియా సంగతి! సరే!

తిమ్మప్ప : (ప్రవేశించి) జయము! జయము! మహారాజ! ఎవరో విద్వజ్జన కోలాహలుఁడట, మహాకవియఁట. తమ దర్శనమును కోరుచున్నాఁడు.

రాయ : పేరేమి?

తిమ్మప్ప : అసలు పేరు చెప్పుట లేదు. బిరుదులే చెప్పుచున్నాఁడు.

భట్టు : వారిపేరు ప్రగడరాజు నరసరాజుగారు ప్రభూ! ఆ బిరుదులన్నియు వారికి సార్థకములే. (పెద్దన వంక, రామకృష్ణుని వంక సాభిప్రాయముగాఁ జూచుచు) మన బంగార మేమో ఆతఁడు ఋజువుపెట్టఁగలఁడు.

(రాయలు సభనంతయు గలయఁజూచుచు; పెద్దనాదులు వ్యగ్రులై యుందురు)

రామకృ : [నవ్వుచు] బండారమున్నవారికే గదా బయల్పడుట; [భట్టుమూర్తివంకఁ జూచుచు] లేనివారికి బయల్పడున దేమున్నది? ఆతనిని రమ్మనుఁడు. ఆపై సంగతి నేను చూచుకొందును.

[రాయలు సైగఁజేయఁగా తిమ్మప్ప నరసరాజును గొనివచ్చును]

న॥రా : [ప్రవేశించి] కృష్ణరాయమహీపాల! విజయోఽస్తు

కం॥ నరసింహ కృష్ణరాయని
కరము నుదగు, కీర్తి యొప్పెఁ గరిబిద్దరిభి
త్కరి కరి భిద్దిరి గిరి భి
త్కరి భిద్దిరి భిత్తురంగ కమనీయంబై.

[చాటుపద్య మణిమంజరి - పుట. 1౦9]

(అందఱును హార్షధ్వానములు సేయుదురు)

కృ॥రా : కవీంద్రా! ఇదే ప్రణమిల్లుచున్నాను మీరు ఆసీనులు కండు.

(సూరన, భట్టుమూర్తి తమ ప్రక్కనున్న యాసనములఁ జూపింతురు.

న॥ రా : (గర్వముతో) 'సమానానా ముత్తమ శ్లోకో అస్తు' అని గదా పెద్దలు చెప్పుదురు. కావున అగ్రాసనమునే యధిష్ఠింతును.

కృ॥ రా : (చకితుఁడై) చిత్త మట్లే చేయుఁడు. తన ప్రక్క నున్న యాననమును చూప గా, నరసరాజు ధూర్జటికి పైఁగాఁ గూర్చుండును. పెద్దనాదులు సక్రోధముగాఁ జూచుచుందురు. భట్టుమూర్తి ఆమోదముతో నవ్వు కొను చుండును.)

రామకృ : (ఎత్తిపొడుపుగా) విద్వజ్జన కోలాహల మహాశయా! తమ రేయే విద్యలలో ప్రవీణులో మే మెఱుంగవచ్చునా?

న॥ రా : దాని కేమి! సమస్య లీయఁగలను; పూరింపఁగలను; ఎవ్వ రెంతవేగమున నెట్టి పద్యమును జెప్పినను గంట మాఁగకుండ వ్రాయఁగలను; వ్రాయుచునే యర్థమును గూడ గ్రహింపఁగలను.

కృ॥ రా : ఆర్యా! మీ న్వగ్రామ మెక్కడ? మీరు ఏయే యాస్థానములను జూచి వచ్చుచున్నారు?

న॥ రా : ప్రభూ! మేము గోదావరీతీరవాసులము. తర్క వ్యాకరణములలో నిష్ణాతుఁడనై కవిత్వమందును చిరకాలము పరిశ్రమించితిని. అనేక సంస్థానములలో జైత్రయాత్రఁ గావించితిని. ఎచ్చటను నాకు నచ్చిన కవిగాని పండితుఁడు గాని లభింప లేదు. కొండవీటి యందే తమరు విద్వత్ప్రభువు లని తమ యాస్థాన మున దిగ్గజములన ప్రఖ్యాతులై పెద్దనాదులున్నా రని విని, ఇచ్చట విజయ పతాక ప్రతిష్ఠించి గజోత్సవ మును కనకాభిషేకమును పొందవలయునని వచ్చితిని.

రామకృ : కోలాహల మహోదయా! మీ కోర్కె కడుంగడు ప్రశస్తము. ఇంక గోష్ఠి యారంభింతమా ?

న॥ రా : (నిరసనతో) నీవేమోయి కొండికవాఁడవు ! పెద్దలతోడనే ప్రసంగింతును.

రామకృ : (కడు వినయముతో) చిత్తము ! చిత్తము ! నేనును దిగ్గజములలో నొకఁడనే ముందు నన్ను జయించి, పిమ్మట నాపై వారిని జయింతురుగాక ! (కఠిన స్వరముతో) ఏదీ తమ లేఖన పాండిత్యము! నేను చెప్పుపద్యమును వ్రాయుదురా ?

న॥ రా : (పత్రమును గంటమును దీసికొని) చెప్పుము.

రామకృ : కం॥ తృవ్వట బాబా తలపై

(నరసరాజు మొదటి యక్షరము నెట్లు వ్రాయవలెనా యని ఆలోచించుచుండును. రామకృష్ణుఁడు ఆలోచన కెడ మీయక)

రామకృ : ఏదీ ! అక్షరము పడలేదే పండితోత్తమా !

పెద్దన : (గంభీరముగ) ఒకటి కుదరకున్న నేమి; రెండః దానిలో నెగ్గవచ్చునుగదా !

రామకృ : పోనీ ! మరియొక పద్యమును చెప్పెదను, అర్థము చెప్పఁగలరా ? (నరసరాజు తలయూఁపును)

రామకృ : (చేతులు కట్టుకొని చలనము లేకుండ)

ఉ॥ తేజము, సాధువృత్తమును దేకువఁగల్గిన ధీరుఁ

డెప్పుడున్। ఆజికి నిట్లనున్ బరుని యాలికి నిట్లను నర్థి కిట్లనున్;। తేజము సాధువృత్తమును దేశువలేని బికారి యెప్పుడున్। ఆజికి నిట్లనున్ బరుని యాలికి నిట్లను నర్థి కిట్లనున్.

న॥ రా : (ఆలోచించుచు ఇట్లనున్, ఇట్లనున్ — ఇద్దఱును ఒకే విధముగనే యందురా ? ఈ పద్యమున కర్థ మేమి ?

రామకృ : ఓహో ! ఏమీ తమ పద్యాన్వయ పాటవము !

సూరన : ఇంతమాత్రమున కేనా ఉత్తమశ్లోకులమని యున్న తాసనము నలంకరించితిరి.

కృ॥ రా : దానికేమిగాని పెద్దనార్యుని, ధూర్జటిని గూడ నతి క్రమించి పైనుండఁ దలంచుట సాహసమే.

రామకృ : దానివలనఁ వారికేమి లోపమా ? ప్రభూ !

ఉ॥ పండితులైన వారలు సభాస్థలి నుండఁగ నల్పుఁ డొక్కఁడు। ద్దండతఁ బీఠమెక్కిన బుధప్రకరంబున కేమి లోటగున్। గొండొక కోఁతి చెట్టు కొనకొమ్మకు నెక్కినఁ గ్రింద మత్తవే। దండ మహోగ్ర సింహ ములు తాలిమిసందవె రాజచంద్రమా !

(చాటు పద్యరత్నాకరము-పుట. 16)

న॥ రా : (కోపముతో) ఇల్లలుకఁగనే పండుగ కాదు. మీరు చెప్పిన పద్యమున కర్థ ముండినఁగదా నే నోడుట.

ఇంతకు మీరు నన్ను పరీక్షించితిరే కాని నేను మిమ్ము పరీక్షింప లేదు.

రామకృ : (కోపముతో) ఇంకను నీకు బింకము తగ్గలేదా! నా పద్యమునకే యర్థము లేదందువా! ఇదిగో చూడుము. (పద్యమును అభినయముతో నర్థము స్పష్టమగునట్లుగా చదువును. ఎల్లరును విస్మితులై హార్షధ్వానములు చేయుదురు.)

రామకృ : (కోపముతో)

చం॥ తెలియని వన్ని తప్పు లని దిట్టతనాన సభాంత
రంబునం। బలుకఁగరాదు మోరి పలుమాఱుఁ
బిశాచవుఁ బాడెకట్ట; నీ। పలికిన నోట దుమ్ము
పడ; భావ్య మెఱుంగవు! పెద్దలైన వా। రల నిర
సింతురా!పగ్గడ రాణ్ణరసా! విరసా! తుసా!బుసా!

(చాటుపద్య మణిమంజరి-పుట.146)

ఇంక తమరు క్రిందికిఁ దిగివచ్చి తోఁచిన సమస్య నీయవచ్చును.

త॥ రా : (సిగ్గుతో చివరకు వచ్చి నిల్చుండి, కోపముతో) ఇట్టి పండిత ధిక్కారమును సహించుచుండుట తమ వంటి విద్వత్ప్రభువుకు తగదు మహారాజా!

కృ॥ రా : (వ్యగ్రతతో) మా రామకృష్ణుడే యోడి యున్నచో తమరెట్లు సమ్మానించియుందురో తెలి

యుడు. ఇప్పటికైన మించినదేమి? సమస్య నిండు. పూరింపలేకపోయినచో "జితాస్మః" అని వీరంద ఱును తమకు పాదాభివందనమే చేయఁగలరు.

వ॥ రా : సరే! (గర్వముతో) అట్లైనచో వినుఁడు......
కుంజర యూథంబు దోమకుత్తుక సొచ్చెన్"
(అందఱును గంభీరులై ఆలోచించుచుందురు వరస రాజు విజయగర్వముతో సభను కలయఁజూచును)

రామకృ : (వికవికనవ్వి కోపముతో దూకుడుగ) ఎట్లూ! కుంజర యూథంబు దోమకుత్తుక సొచ్చెనా? ఎక్క డరా?

కం॥ గంజాయి త్రాగి తురకల
సంజాతులఁ గూడి కల్లు చవిగొన్నావా?
లంజల కొడకా! యెక్కడ
కుంజర యూథంబు దోమకుత్తుక సొచ్చెన్.
(చాటుపద్య మణిమంజరి - 146)

పెద్దన : ఆగుము ఆగుము : రామకృష్ణా! తిట్టకుము; తిట్ట
కృ॥రా: కుము; ఇది సభా మర్యాద కాదు.

వ॥ రా : ప్రభూ : ఇది తుంటరుల సభ కాని పండితుల సభ కాదు. ఇతఁడు నా సమస్యకు అర్థమునే గ్రహింపఁ జాలక యిట్లు తిట్టుతో పద్యమును పూరించినచో నిది పూరణ మగునా? పండితులు మెత్తురా? ఇది మోటమిని కప్పిపుచ్చుకొనుట కాదా?

రామకృ : (కోపముతో) ఓయీ! దుర్మదాంధ! ఇంకను మేల్కొనలేదవేమి? ఇది పండిత సభ కావుననే బ్రతికి పోయితి; లేకున్న నీపై శాపాక్షరములతో శతకమునే చెప్పియుందును. నీ యోగ్యతకు తగినట్లే నీ సమస్యను పూరించితిని.

కృ॥ రా : (నవ్వుచు) రామకృష్ణా! శాంతింపుము. ఆ సమస్యను నే నిచ్చినచో నెట్లు పూరింతువో చెప్పుము.

రామకృ : చిత్తము ప్రభూ!

కం॥ రంజన చెడి పాండవు లరి
భంజనులై విరటుఁ గొల్వఁ బాల్పడి రకటా!
సంజయ! *యేమని చెప్పుదుఁ
గుంజర యూథంబు దోమకుత్తుక సొచ్చెన్.

[చాటుపద్య మణిమంజరి - పుట. 147]

(* "విధి నేమందును" అనియుఁ బాఠము గలదు)

(అందఱును హర్షధ్వానములు చేయుదురు)

కృ॥ రా : (పరిహాసముతో) కోలాహల మహాశయా! తమ రిచ్చిన సమస్య పూరింపఁబడినట్లేనా?

న॥ రా : (నీరసముతో) రామకృష్ణకవి అద్వితీయ ప్రతిభాశాలి. నేనే సర్వథా, విజితుఁడను. నాకు అనారోగ్యముగా నున్నది. సెలవిచ్చినచో పోయి విశ్రమింతును. అయ్యా! పండిత కవిమండలి కిదే నా ప్రణతులు.

రామకృ : (లేచి వచ్చి, నరసరాజు రెండు చేతులను బట్టు కొని) మీరు పెద్దలు. నన్ను మన్నించి ఆశీర్వాదింపుడు సభా మర్యాదను గాపాడుకొనుటకై వాదమున ధార్ష్ట్యమును జూపితిని. అది మనసునఁ బెట్టకుఁడు.

(నమస్కరించును)

న॥ రా : (ప్రీతితో) నిజమైన పండితుఁడవు నీవే నోయి! నీయట్టి ప్రతిభాశాలి, వినయ సుందరుఁడు మరియొక్కఁడుండఁడు. చిరంజీవ! చిరంజీవ! అభ్యుదయ పరంపరాభివృద్ధి రస్తు!

(రాయలు సైగఁజేయఁగా భటుఁడు పళ్ళెరమున పండ్లు తాంబూలము, వస్త్రములు తెచ్చును)

కృ॥రా : నేఁడు నాకు జన్మదినము. ఈ శుభ సమయమున తా మీ పారితోషికమును పరిగ్రహించి నన్నాశీర్వదింపుఁడు.

న॥రా : (స్వీకరించి) ఆయుష్మాన్! విజయీ భవ!

(వెడలిపోవును)

కృ॥రా : ఈ రోజు సుదినము. మన రామకృష్ణునివలన భువన విజయము సార్థకమైనది.

పెద్దన : మొత్తముమీఁద రామకృష్ణుఁడు మన పరువు నిలిపినాఁడు.

రామకృ : అంతయు పెద్దల యాశీర్వచన బలమే.

తిమ్మన : రామకృష్ణా ! ఏదీ ! నీ వింతకుముం దారంభించిన
పద్యమును పూర్తి చేయుము.

రామకృ : కం॥ తృవ్వఁట బాబా, తలపైఁ
బువ్వఁట జాబిల్లి, వల్వ బూచఁట, చేదే
బువ్వఁట, చూడఁగను వాని
క్కవ్వఁట తలవంగ నిట్టి హారునకు జేజే !
(చాటుపద్య మణిమంజరి - పుట. 146)

తిమ్మన : ఆహా ! ఏమోయి ! నీ పద్యస్ఫురణము ! పెద్దన
గారు కవితాపితామహులే ! కాని నీవు కేవలము
శారదవే.

మ॥ ఉదయం బస్తనగంబు సేతువు హిమవ్యూహంబు
నుం జుట్టిరా । విదితం బైన మహిన్ మహాంధ్ర
కవితా విద్యాబలప్రౌఢి నీ। కెదు రేరీ! సరసార్థ బోధ
ఘటనాహేలా పరిష్కార ! శా । రద నీ రూపము;
రామకృష్ణ కవిచంద్రా ! సాంద్ర కీర్తీశ్వరా !
పాండురంగ మాహాత్మ్యము 1 ఆశ్వా-ప. 27

పెద్దన : తిమ్మనగారు చక్కఁగా చెప్పినారు.

కృ॥ రా : నేఁటి కవితా గోష్ఠి చిరస్మరణీయముగా జరిగినది.

(తెరలో — వందిమాగధులు)

ప్రథముఁడు : కం॥ ప్రతివర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవి నికర గుంభిత కావ్య
స్మృతి రోమాంచ విశంకిత
చతురాంకః పురవధూ ప్రసాదన రసికా!

పారిజాతాపహరణము - 1 ఆశ్వా, ప. 139

రెండవ వాఁడు : మహారాజా!

శా॥ శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బాఱెం బక్షు
లుష్ణాంశు పా। షాణవ్రాతము శోష్ణ మయ్యెఁ
మృగతృష్ణా వార్ధు లింకెం; జపా। శోణం బయ్యెఁ
బతంగ బింబము; దిశాస్తోమంబు శోభా దరి।
ద్రాణం బయ్యెఁ; సరోజషండములు నిద్రాణంబు
లయ్యెంగడున్.

మనుచరిత్ర - 3 ఆశ్వా - ప. 12.

(రాయలు సైగఁజేయఁగా భటుఁడు పళ్ళెరములో
పండ్లు, శాలువులు తాంబూలములు పెట్టి తెచ్చును)
(రాయలు పెద్దన మొదలుగా అందఱకును వరుసగా
పళ్ళెరముల నందించును.

ఒక్కొక్కరును స్వీకరించి రాజుపై పుష్పాక్షతలను
చల్లుదురు.)

కృ॥రా : నేఁటికి సభ చాలింతము (ఎల్లఱకును నమస్కరిం
చును.)

అందఱు : (చేతులెత్తి) సర్వే సన్మంగళాని భవంతు !

(రాయలు వెడలిన పిదప పెద్దనాదు లొక ప్రక్కగ, ధూర్జటి మొదలగువారు వేరొక ప్రక్కగ నిష్క్రమింతురు.)

( తెరవ్రాలును )

—: సమాప్తము :—

## అనుబంధము – ప్రదర్శనముల వివరములు

పాత్రలు : 1–1–1966 నెల్లూరు పురమందిరము.

1) సూత్రధారుడు : సాహిత్య విద్యాప్రవీణ శ్రీ వేదం వేంకటరమణశర్మ.

2) శ్రీకృష్ణదేవరాయలు విద్వాన్: శ్రీ కంకా రెడ్డి

3) పెద్దన : ఆకాశవాణి పౌరాణికులు, శ్రీ ఆకిలి మల్లికార్జునయ్య.

4) తిమ్మన : సాహిత్య భూషణ, విద్వాన్ శ్రీ నాలూరి మాల కొండయ్య.

5) ధూర్జటి : భాషాప్రవీణ, శ్రీ చివుకుల వేంకటరమణ శర్మ, ఎం. ఏ. బి. ఇడి.

6) రామభద్రుడు : శ్రీ చిల్లర వేంకట రమణయ్య, బి. ఏ. బి. ఇడి.

7) మల్లన : సాహిత్య విద్యాప్రవీణ, శ్రీ వేదం వేంకట రమణశర్మ.

8) రామకృష్ణుడు : హరికథా ప్రవీణులు, శ్రీ పండితారాధ్యుల సాంబమూర్తి.

9) భట్టుమూర్తి : వ్యాకరణ విద్యాప్రవీణ, ఆయుర్వేద విశారద, శ్రీ ఉత్పల రాఘవశర్మ

11) నరసరాజు : శ్రీ ఆకిలి శంకరయ్య.

12) తిమ్మప్ప : చి॥ పి. జి. రాఘవేంద్రరావు, బి. ఏ.

13) రెండవ దౌవారికుడు శ్రీ వి. వేంకటస్వామి

14) మొదటి వైతాళికుడు శ్రీ పి. రామసుబ్బారెడ్డి

15) రెండవ వైతాళికుడు : భాషా ప్రవీణ, శ్రీ పట్టిపల్లి మల్లినాథశర్మ.

16) వాచిక సహాయులు : విద్యాప్రవీణ, భాషాప్రవీణ శ్రీ గోసుకొండ వేంకట సుబ్బయ్య.

— —

24-12-1967 నెల్లూరు పురమందిరము.

1) సూత్రధారుఁడు : శ్రీ ఇలపావులూరి. కామేశ్వరరావు ఎం. ఏ. బి. ఇడి.

2) శ్రీకృష్ణదేవరాయలు విద్వాన్ కోంకారెడ్డి.

3) పెద్దన : ఆకాశవాణి పౌరాణికులు, శ్రీ ఆకిలి మల్లికార్జునయ్య.

4) తిమ్మన : సాహిత్య భూషణ, విద్వాన్ శ్రీ నౌలూరి మాలకొండయ్య.

5) ధూర్జటి : శ్రీ ఇలపావులూరి కామేశ్వరరావు, ఎమ్. ఏ. బి. ఇడి.

6) రామభద్రుఁడు : చి॥ టి. వేంకట సుబ్బయ్య చౌదరి.

7) మల్లన : చి॥ ఎస్. ఉమామహేశ్వరరావు.

8) రామకృష్ణుడు : హరికథా ప్రవీణులు, శ్రీ పండితా
రాధ్యుల సాంబమూర్తి.

9) సూరన : చి॥ గాజులపల్లి రామగోపాల్.

10) భట్టుమూర్తి : వ్యాకరణ విద్యాప్రవీణ, ఆయుర్వేద
విశారద శ్రీ ఉత్పల రాఘవశర్మ.

11) నరసరాజు : శ్రీ ఆకిలి శంకరయ్య.

12) తిమ్మప్ప : చి॥ పాటూరి చంద్రశేఖర శర్మ.

13) రెండవ దౌవారికుడు చి॥ సంపత్కుమార్

14) మొదటి వైతాళికుడు : విద్యాప్రవీణ భాషాప్రవీణ,
శ్రీ గోసుకొండ వేంకట సుబ్బయ్య.

15) రెండవ వైతాళికుడు : భాషాప్రవీణ, శ్రీ పట్టిపల్లి
మల్లినాథశర్మ.

16) వాదిక సహాయులు : విద్యాప్రవీణ, భాషాప్రవీణ,
శ్రీ గోసుకొండ వేంకట
సుబ్బయ్య

---

31-3-1964 శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాల - తిరుపతి!

1. సూత్రధారుడు : సాహిత్య భూషణ, విద్వాన్ శ్రీ
నాలూరి మాలకొండయ్య.

2) శ్రీకృష్ణదేవరాయలు : విద్వాన్, శ్రీ వి. వేంకారెడ్డి
3) తిమ్మరుసు : శ్రీ డి. ఓబులరాజు.
4) పెద్దన: ఆకాశవాణి పౌరాణికులు, ఆకిలి మల్లికార్జునయ్య
5) తిమ్మన : సాహిత్య భూషణ, విద్వాన్, శ్రీ నోలూరి మాలకొండయ్య.
6) ధూర్జటి : చి॥ మెట్టు రామచంద్రప్రసాద్, ఎమ్. ఏ.
7) రామభద్రుఁడు : చి॥ ఎం. కామయ్య.
8) మల్లన : చి॥ ఎన్. ఉమామహేశ్వరరావు.
9) రామకృష్ణుఁడు : పోలూరి హనుమజ్జానకి రామశర్మ,
10) సూరన చి॥ గాజులపల్లి రామగోపాల్.
11) భట్టుమూర్తి : వ్యాకరణ విద్యాప్రవీణ, ఆయుర్వేద విశారద, శ్రీ ఉత్పల రాఘవశర్మ.
12) ఎల్లన : శ్రీ ఆకిలి శంకరయ్య.
13) నృసింహకవి : శ్రీ పోలూరి హనుమజ్జానకి రామశర్మ
14) చిన తిమ్మన : చి॥ టి. వేంకట సుబ్బయ్య
15) నరసరాజు : శ్రీ ఆకిలి శంకరయ్య.
16) తిమ్మప్ప : చి॥ పాటూరి చంద్రశేఖరశర్మ
17) రెండవ ద్వారికుఁడు : శ్రీ వేంకటేశ్వర కళాశాలా విద్యార్థి, శ్రీ వై. సుధాకర్.

18) వైతాళికులు : శ్రీ వేంకటేశ్వర కళాశాలా విద్యార్థులు.

19) వాచిక సహాయులు : 1) విద్యాప్రవీణ, భాషాప్రవీణ శ్రీ గోసుకొండ వేంకట సుబ్బయ్య.

2) విద్యాప్రవీణ, చి॥ పిసుపాటి వేంకట వాసుదేవశర్మ.

---

25-12-1968 నెల్లూరు పురమందిరము.

1) సూత్రధారుఁడు : శ్రీ ఇలపావులూరి కామేశ్వరరావు A. B. Ed.

2) శ్రీకృష్ణదేవరాయలు : విద్వాన్ శ్రీ వేంకారెడ్డి.

3) తిమ్మరుసు : శ్రీ డి. ఓబులరాజు.

4) పెద్దన : విద్వాన్ శ్రీ ఉత్పల వేంకట సుబ్రహ్మణ్యం

5) తిమ్మన : సాహిత్య భూషణ, విద్వాన్ శ్రీ నాలూరి మాలకొండయ్య.

6) ధూర్జటి : భాషాప్రవీణ, శ్రీ బి. పురుషోత్తము.

7) రామభద్రుఁడు : చి॥ ఎం. కామయ్య.

8) మల్లన : చి॥ ఎస్. ఉమామహేశ్వరరావు.

9) రామకృష్ణుఁడు : చి॥ పాటూరి చంద్రశేఖరశర్మ.

10) సూరన : చి॥ గాజులపల్లి రామగోపాల్

11) భట్టుమూర్తి : వ్యాకరణ విద్యా ప్రవీణ, ఆయుర్వేద విశారద శ్రీ ఉత్పల రాఘవశర్మ

12) ఎల్లన : శ్రీ ఆకిలి శంకరయ్య.

13) నృసింహకవి : శ్రీ పోలూరి హనుమజ్జానకీ రామశర్మ,

14) చిన తిమ్మన : చి॥ టి. వేంకట సుబ్బయ్య చౌదరి.

15) నరసరాజు : శ్రీ ఆకిలి శంకరయ్య.

16) తిమ్మప్ప : చి॥ పాటూరి చంద్రశేఖర శర్మ.

17) రెండవ దౌవారికుఁడు : శ్రీ వై. సుధాకర్.



పాత్రలు 15-12-1969 నెల్లూరు పురమందిరము.

1) శ్రీకృష్ణదేవరాయలు : చి॥ కె. హరిప్రసాదరెడ్డి.

2) పెద్దన : చి॥ ఎం. వి. ఎస్. ప్రసాద్.

3) తిమ్మన : చి॥ వి. సోమశేఖర్.

4) ధూర్జటి : చి॥ కె. రామకృష్ణ.

5) రామభద్రుఁడు : చి॥ పి. గౌరీశంకర్.

6) మల్లన : చి॥ ఎన్. వేంకటేశ్వర్లు

7) రామకృష్ణుఁడు : చి॥ టి. బి. అరుణప్రసాద్.

8) నూరన : చి॥ ఎన్. రమణి.

9) భట్టుమూర్తి : చి॥ సత్యసాయి సురేశ్ కుమార్

10) నరసరాజు : చి॥ కె. మురళీధర్.

11) తిమ్మప్ప : చి॥ ఎస్. వేంకటేశ్వర్లు.

12) మొదటి దౌవారికుఁడు : చి॥ ఇసికెళ్ళ సుధాకర్.

13) రెండవ దౌవారికుఁడు : చి॥ పాముల వీరవేంకట సుందర సుబ్రహ్మణ్యము.

14) సూత్రధారుఁడు : చి॥ చంద్రశేఖరశర్మ.

---

పాత్రలు 26-3-72 శ్రీ వేద సంస్కృతోన్నతపాఠశాల నెల్లూరు.

1) శ్రీకృష్ణదేవరాయలు : చి॥ సౌ॥ ఉద్దండి నాగవేణి.

2) పెద్దన : చి॥ నూరం సుధాకర్.

3) తిమ్మన : చి॥ సౌ॥ పూజారి సుజాత.

4) ధూర్జటి : చి॥ సౌ॥ మునిగాల కాంతమ్మ.

5) రామభద్రుఁడు : చి॥ సౌ॥ దిడ్డి రమణేశ్వరి.

6) మల్లన : చి॥ సౌ॥ తెలికేపల్లి సాయి పద్మ.

7) రామకృష్ణుఁడు : చి॥ సౌ। కొమండూరి శ్రీదేవి.

8) సూరన : చి॥ సౌ॥ చెంజి సూర్యకాంతం.

9) భట్టుమూర్తి : ఎస్. కె. జహీందా బేగమ్.

10) నరసరాజు : చి॥ బుడంగుంట వేంకటేశ్వర్లు.

11) తిమ్మప్ప : చి॥ రాయ సుధాకర్.

12) మొదటి దౌవారికుఁడు : చి॥ ఇసికెళ్ళ సుధాకర్.

13) రెండవ దౌవారికుడు చి॥ పాముల వీరవేంకట సుందర సుబ్రహ్మణ్యము.

---